ఎదలో పున్నమి వెన్నెల –

మోముపై పూరేకుల చల్లదనం –

మాటల్లో తేనియల తీయదనం –

చేతల్లో నెమ్మది నిండిన కమ్మదనం –

అదే అమ్మ !

తనలోని అన్నీ రంగరించి నను మలచిన

మా అమ్మకే ఇది ....

– మలిక్

# అంగీకారం

ఖుర్‌ఆన్‌కు భాష్యం చెప్పిన వారు చాలా మంది ఉన్నారు. దానికి ఖుర్‌ఆన్ భాషా పాండిత్యం, ఖుర్‌ఆన్ భావసైశిత్య పరిజ్ఞానం, ఖుర్‌ఆన్ నెరపిన ఉద్యమ అవగాహనం, ఖుర్‌ఆన్ తెలిపిన సందేశ అధ్యయనం, ఇంకా ఎన్నెన్నో కావాలి. అవన్నీ నాకు లేవు.

ఖురఆన్ చదువుతూ ఉంటే నాలో వెలిగిన అలల ఛాయలే ఈ 'వెన్నెల తెరలు'.

తెలుగు భాషా పాండిత్యమూ లేదు, ఖుర్‌ఆన్ భాషలో ప్రవేశమూ లేదు, మరెందుకు ఈ సాహసం చేశానో నాకే తెలీదు. ప్రపంచం ఓ ప్రయోగశాల; ఒక్కో జీవితం ఓ ప్రయోగం. ఒక్కో ప్రయోగంలోని ఒక్కో అంశం మరి ప్రయోగాలకు మార్గదర్శకం కావచ్చు. అందుకే ఖుర్‌ఆన్‌తో నా పరిచయ ప్రయోగాన్ని ఇలా పొందుపరచాలనుకున్నానేమో - నా అధఃచేతనా కుహరంలో !

గీటురాయి మాసపత్రికను వెలువరించాలని గీటురాయి యాజమాన్యం తలపెట్టినప్పుడు ఇలాంటి కాలమ్ ఒకటి నిర్వహిస్తానని మాటనిచ్చాను. ఆ మాటను కొన్నేళ్ళపాటు నిలబెట్టుకున్నాను. 'ఈ నెల వెన్నెల' అనే ఆ 'కాలా'న్ని ఇలా 'వెన్నెల తెరల'లో బంధించారు సోదరులు సయ్యిద్ హుసైన్. దాన్ని ఇంకా సజావుగా ముందుకు నడిపించడానికి కూడా ఆయనే ముందుకు వచ్చారు. ఇంకా ఎందరయినా రాగలగాలని ఆశిస్తున్నాను.

మలిక్

హైదరాబాద్
6.4.1995

# మాటల మాంత్రికుడు!

'వెన్నెల తెరలు' అనే ఈ పుస్తకానికి మలిక్‌భాయి నన్నెందుకు రాయమన్నారో నాలుగు మాటలు! ఏ విధంగా చూసినా, యిందులోని విషయానికి సంబంధించి నేను 'నిరక్షర కుక్షిని'. ఈ విషయం ఆయనకు బాగా తెలుసునే! నా పట్ల మలిక్ భాయికి వున్న అపారమయిన ప్రేమాభిమానాలవలన, తన పుస్తకంలో యేదో ఒక విధంగా నా ప్రమేయం కూడా వుండాలని ఈ ఆదేశం జారీ చేసి వుంటారు.

ఎస్.ఎమ్.మలిక్ అనేది యిప్పుడు ఆధ్యాత్మిక సాహిత్య రంగంలో చిర పరిచితమయిన పేరు. సాధారణ సాహిత్య లోకానికి దూరంగా నెలకొనివున్న ఒక ప్రత్యేక అక్షర ప్రపంచంలో ఆయన చడీచప్పుడు కాకుండా తనపని తాను చేసుకుంటూ పోతున్నారు. నిజానికి మా యిరువురివీ రెండు వేర్వేరు ప్రపంచాలు. ఆయన నిర్మల వ్యక్తిత్వం, ఆయన సాహితీ వైదుష్యమే నన్ను తన సాన్నిహిత్యంలోకి ఆకర్షించాయి.

ఇంత గొప్ప భావుకుడు, అక్షరాల మీద యింతటి అధికారం చెలాయించగల వాడు, కవిత్వానికి కదిలిపోయేవాడు, కవిత్వంతో కదిలించే వాడూ, సుతి మెత్తని పలుకున్నవాడూ, నవ్యనవనీత సమానమయిన మనసున్నవాడూ.... మానవ అంతఃకరణాల చేతన యెరిగిన జ్ఞాని, 'సందేశభవనం' అనే ఒక ధార్మిక సందేశ కేంద్ర భవనంలో వున్నాడని చాలా మంది సాహితీపరులకు యిప్పటికీ తెలియదు. నేను నా సన్నిహిత సాహితీ మిత్రులతో అంటూ వుంటాను - 'మలిక్‌గారి వంటి మహత్తరమయిన కవినీ, రచయితనీ మనం కోల్పోయామని. ఈ అభిప్రాయంతో మలిక్ భాయి అంగీకరించరని నాకు తెలుసు. ఇస్లామీయ ధార్మిక భావజాల ప్రచారానికి ఆయన తనని తాను అంకితం చేసుకున్నారు. ఇందులో యిక యెటువంటి మినహాయింపులూ లేవు.

మలిక్‌భాయితో సాహిత్యాన్ని గురించి కాసేపు మాట్లాడితే, ఆయన అత్యాధునిక భావాలూ, సమకాలిక సాహిత్య ధోరణులను గురించి తన వద్ద వున్న తాజా సమాచారం మనల్ని ఆశ్చర్య పరుస్తాయి. సన్నిహితంగా మెలిగే నా గురించి

మాత్రమే కాక, శివారెడ్డి కవిత్వం గురించీ, 'చేరాతలు' గురించీ, దళిత కవిత్వం గురించీ కూడా ఆయన మాట్లాడతారు.

మలిక్‌భాయితో సమాజాన్ని గురించి కాసేపు మాట్లాడితే ఆయన చరిత్రనీ, వర్తమానాన్నీ యెంతగా పట్టించుకుంటున్నారో అర్థమవుతుంది. జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలమీద, పరిణామాల మీద ఆయనకుగల అవగాహన అబ్బుర పరుస్తుంది. ఈ 'వెన్నెల తెరలు' వెనుక పిల్లి తెమ్మెర వలె కదలాడే భావుకతాపతాక ఆయనే. తనకు ఏమీ తెలియదని చెప్పుకోవడం ఆయన వినయ గుణం. 'ఇంటెలెక్చువల్ హ్యుమిలిటీ' అంటారే, దానిని చూడాలంటే మలిక్ భాయిలోనే చూడాలి.

ఆయన అత్యున్నత స్థాయికి చెందిన కవి. అచ్చ తెలుగుకి పిచ్చి అభిమాని. పరిపక్వత చెందిన సామాజిక వ్యాఖ్యాత. నేను పోరు పెడుతున్నాను, ఆయన కవితా సంపుటి వెలువరించాలని. ఆయన వచన శైలి గురించి 'చేరా' వంటి వారికి యిప్పటికే తెలుసు కానీ, ఆయన కవిత్వం గురించి యెవరికీ యేమీ తెలియదని నాకు మాత్రమే తెలుసు. 'ప్రభువు పిలుస్తున్నాడు' తరువాత 'వెన్నెల తెరలు' మలిక్ భాయి స్వతంత్ర వచన శైలికి మరొక ఉదాహరణ.

ఇందులో ఆయన చర్చించిన లౌకిక, అలౌకిక, ఆధ్యాత్మిక అంశాలపట్ల, ముందే మనవి చేసినట్లు, నా పరిజ్ఞానం దాదాపు శూన్యం. తెలియని విషయాలు తెలిసినట్టు మాట్లాడడం చేత కాని ఈ చేతకాని వాణ్ణి క్షమించి, తియ్య తేనియ పలుకులతో అచ్చతెలుగు పరిమళాలతో, మెత్తమెత్తటి మెరుపులతో నిర్మించిన ఈ అపురూపమయిన అక్షరాల పూలపడవలో పయనం ప్రారంభించండి. అవిశ్వాస సోదరులకు ఒక హెచ్చరిక. మలిక్ భాయి మాటల మాంత్రికుడు. ఈ పడవ దిగే సమయానికి మీరు మీరుగా మిగలక పోవచ్చు !

భవదీయుడు<br>
దేవిప్రియ

7, ఏప్రిల్, 1995<br>
హైదరాబాదు

# 1

**మన చుట్టూ** ఉన్న ప్రపంచం నలువైపుల నుండి మన మీదికి విషం నిండిన అస్త్రాలు ప్రయోగిస్తోంది:

- భౌతిక ప్రయోజనాల బాణాలు
- భోగ విలాసాల కరవాలాలు
- మిథ్యాభావాల ఖడ్గాలు
- నవ్యతాలాలస తుపాకులు
- అప్రాచ్య సంస్కృతి ఫిరంగులు

వీటినన్నింటినీ తప్పించుకు తిరిగితేనే విశ్వాసం మనతోపాటు ఉంటుంది. అలాకాక– కళ్ళకు కనిపించే ప్రతి తళుకు మనల్ని ఆకర్షిస్తే

- మనసులో తలెత్తే ప్రతి కోరిక మనల్ని ఆక్రమిస్తే
- బుద్ధిని రంజింపజేసే ప్రతి భావం మనల్ని ఆవహిస్తే
- కమ్మగా వుండే సకల రుచులను మనం ఆస్వాదిస్తే
- జిగేల్ మనిపించే ప్రతి సంస్కృతీ సౌధాన్నీ మనం ఆశ్రయిస్తే విశ్వాసం మనల్ని వదిలించుకుని పారిపోతుంది.

విశ్వాసం ప్రీతిప్రదమయితే, దాన్ని పై అస్త్రాల నుండి మనం కాపాడుకోదలిస్తే, ఆ అస్త్రాల వాస్తవికత మనకు అర్థం కావాలి. అంటే అధర్మాన్నుండి దూరంగా ఉండడానికి, ధర్మంతోపాటు "అధర్మం" ఏమిటో కూడా తెలుసుకోవాలి; సత్యంతోపాటు అసత్యం అంటే ఏమిటో గ్రహించాలి; ఇస్లామ్‌తోపాటు ఇస్లామేతర భావాలేమిటో ఆకళింపు చేసుకోవాలి.

జ్ఞానం, అజ్ఞానాల ఈ అవగాహన లేనిదే ధర్మపథాన ఒక్కడుగూ మనం

ముందుకు వెయ్యలేము. ఈ అవగాహన కుదరడానికి, అజ్ఞానం దూరమయి జ్ఞానం చేరువవడానికి మనం శ్రమపడవలసి వస్తుంది. సమయం వెచ్చించవలసి వస్తుంది, డబ్బు ఖర్చు చెయ్యవలసి వస్తుంది. నిజంగా విశ్వాసం (ఈమాన్) మనకు ప్రియమయినదేనా?

అయితే అది మన శ్రమను, సమయాన్ని, సిరిని కాంక్షిస్తోంది.

– ఈ త్యాగానికి సిద్ధమవండి.

*(ఏప్రిల్ 1987)*

# 2

**జ్యోతి – జ్యోతే** నిజమయింది. జ్యోతే సహజమయింది, ప్రకృతి సిద్ధమయింది. దాన్ని కప్పిపెడితేనే అంధకారం ఆవరిస్తుంది– మనిషిలోనూ, సంఘంలోను. అంధకారాన్ని దూరం చెయ్యాలంటే కాంతిపైన కప్పుకున్న తెరల్ని, పొరల్ని చీల్చాలి– అప్పుడే చీకట్లు పటాపంచలవుతాయి.

మనిషి ప్రకృతిసిద్ధంగా సంస్కారప్రియుడు, మంచిని ప్రేమిస్తాడు, చెడును ద్వేషిస్తాడు. మనిషిలోని సహజ గుణాన్ని అతని పోషణ, శిక్షణ వాతావరణాలు పెంపొందిస్తాయి.లేదా అణగద్రొక్కుతాయి. 'మంచి' ప్రవర్ధమానమయితే మానవ జీవితమూ వికసిస్తుంది, మనుగడలో కమ్మదనాలూ పురి విప్పుతాయి; జీవనమే సంస్కార సౌరభాలతో గుబాళిస్తుంది. మంచి అన్నది అణిగితే పైకి వచ్చేది, పెరిగేది చేదు అనుభవాలే, కుళ్ళు బ్రతుకులే, దుర్గంధ భరితమైన వాతావరణమే. వాతావరణం నైతికంగా కలుషితమయి నప్పుడు సర్వత్రా – వ్యక్తుల్లోను, సమాజంలోను కానవచ్చేది, చెలామణి అయ్యేది, రాజ్యమేలేది చెడులే. అలా చీకట్లు నలువైపులా ప్రతిధ్వని స్తున్నప్పుడు, చీకట్లు ఎల్లెడలా ప్రతిఫలిస్తున్నప్పుడు కాంతి కరవాలం ఒక్కటే తిమిర తిమింగలాన్ని చీల్చి అరుణోదయ జ్యోతుల్ని ప్రసరింపజేస్తుంది.

ప్రతి పొద్దుపొడుపూ మనకు చెప్పే చదువు ఇదే.

మన జీవితాల్లో ఆత్మను వికసింపజేసే పరిమళాలు కరవయ్యాయి, మనసును పులకరింపజేసే మధురిమలు దూరమయ్యాయి, శాంతిని అందజేసే కాంతులు అందకున్నాయి. మనోమయ జగత్తుకు నెమ్మదినిచ్చేది, చీకట్లను పారద్రోలేది, బ్రతుకుకు బాట చూపేది, జీవితానికి గమ్యాన్నిచ్చేది కావాలి. అదే నేటి మన ముఖ్యావశ్యకత.

విశ్వప్రభువు ఆ ముఖ్యావసరాన్ని తీర్చే ఏర్పాటు చేశాడు. మన ఆంతర్యాల్లోని అంధకారాన్ని అంతమొందించే కాంతి పుంజాలను అందజేశాడు, దివ్య ఖుర్ఆన్ రూపంలో. కలత చెందిన హృదయాలకు శాంతిని, తృప్తిని, ప్రశాంతతను సమకూర్చే వరప్రసాదాన్ని అనుగ్రహించాడు.

*బాగా తెలుసుకోండి, దైవసంస్మరణ ద్వారానే హృదయాలకు నెమ్మది సంప్రాప్తమవుతుంది ! (13 : 28)*

అవును, దైవ నామ మాధుర్యం ద్వారానే హృదయాలు నెమ్మదిని ఆస్వాదిస్తాయి.

* * *

ఇది దివ్య ఖుర్ఆన్ అవతరణ ప్రారంభమయిన నెల. ఈ దైవ సందేశాన్ని అర్థం చేసుకునేందుకు సమయాన్ని, శక్తిని వెచ్చించవలసిన శుభకాలం. నిగ్రహాన్ని, సంయమనాన్ని పాటించవలసిన గొప్ప సమయం. రోజా పరీక్షలో, దైవాజ్ఞాపాలనలో శిక్షణలో నిగ్గుదేలి తరించవలసిన ఘనమయిన తరుణం.

మన మనసులను ఆవహించిన అంధకార పిశాచాన్ని, మన వాతావరణాన్ని ఆవరించిన కరుడుగట్టిన చీకటిని దూరం చెయ్యడానికి, జీవితాన్ని జ్యోతిర్మయం చెయ్యడానికి దివ్య ఖుర్ఆన్ ద్వారా ఓ దివ్వె వెలిగిద్దాం; సకల విధాల భయాల భయంకర భూతాల నుండి మన అంతరాళాలను ప్రక్షాళన చేసుకుందాం. పరిశుద్ధ ఆత్మలతో, ప్రఫుల్ల హృదయాలతో పవిత్రం చేసి, జీవితాన్ని పునఃప్రారంభించే ప్రతిజ్ఞ చేద్దాం.

*(మే 1987)*

# 3

**అవును, దివ్య ఖుర్ఆన్** పారాయణం చేశాము. స్వయంగా పారాయణం చెయ్యడమే కాక, హాఫిజ్‌లను నియమించి మరీ ఖుర్ఆన్ పఠనాన్ని వీనుల విందుగా విన్నాము. తరావీహ నమాజ్‌లో రోజూ దాదాపు గంట, గంటన్నరసేపు నిద్ర సుఖాన్ని నిష్కర్షగా త్రోసిపుచ్చి ఈ మహత్కార్యం కొరకే కేటాయించాము. రమజాన్ నెల సాంతం, సమయం దొరికినప్పుడల్లా పరమ పవిత్రమయిన ఆ ఉద్గ్రంథ పఠనం చేశాము.

సకల లోకాలకు ప్రభువయిన అల్లాహ్ తన దాసులయిన మానవుల కోసం, తన ప్రేమకు ప్రతీకగా, తన ప్రీతిపథానికి ప్రమిదగా, మానవ హృదయ నిశీథికి ప్రత్యూషగా, మానవాంతర్య రుగ్మత నివారిణిగా, దివి నుండి దింపిన దివ్య ఔషధి అది. ఆ పరమ దివ్య గ్రంథాన్ని మధుర మకరంద ధారలు జాలువారుతుండగా దివ్యంగా శ్రావ్యంగా గానం చేశాము. ఆ గ్రంథరాజాన్ని కాంతులు వెదజల్లే కళావైభవం తొణకిసలాడగా బంగరు సిరాతో వ్రాయించాము. ఆ మహాగ్రంథ పత్రాలను ప్రాణప్రదంగా, పవిత్రంగా, భక్తిప్రపత్తులతో తలపైన మోశాము, కళ్ళ కద్దుకున్నాము, భద్రపరిచాము. దాని ఎడల గౌరవభావాన్ని, భయభక్తుల్ని, ప్రేమాదరణల్ని ఎన్ని విధాల వ్యక్తం చెయ్యాలో అన్ని విధాలా ప్రదర్శించాము. ఇంకేం చెయ్యాలి?

నిజమే, ఇదంతా చెయ్యవలసిందే. కాని మీరు విద్యార్థులయితే

మీ పాఠ్యపుస్తకాలను ఇలాగే అర్థం చేసుకోకుండా 'పారాయణం' చేస్తారా? మీరు కొనే దిన, వార, మాసపత్రికల్ని ఇలాగే 'అనుసంధానం' చేసి భద్ర పరుస్తారా? మీకు మీ కార్యాలయాల నుండి అందే ఆదేశ పత్రాలను సువర్ణాక్షరాలతో వ్రాయించి మీ కుడ్యాలంకరణ కొరకు వినియోగించు -కుంటారా? న్యాయస్థానం మీకు దండన విధిస్తూ తీర్పు ఇస్తున్నప్పుడు-

'ఆహా! న్యాయమూర్తి కంఠం ఎంత కర్ణపేయంగా ఉంది! ఎన్ని సంగీత సౌరభాలు విరజిమ్ముతోంది!!' అని సంభ్రమాశ్చర్యాల్లో మునిగితేలుతారా? మీరే చెప్పండి, ఖుర్ఆన్ పట్ల మీ వైఖరిని ఎలా అభివర్ణించాలో!?

దివ్య ఖుర్ఆన్ మీ స్వామి పంపిన సందేశం; మార్గదర్శక గ్రంథం; జీవన నియమావళి; ఆంక్షలూ అనుమతులున్న ప్రవర్తనా నిబంధనావళి; ఆర్థిక సూత్రావళి; శిక్షాస్మృతి; శాసన గ్రంథం; రాజ్యాంగ పత్రం. గుడ్డిగా పారాయణం చెయ్యడానికి బట్టీయం వెయ్యడానికీ కాదు, నేత్ర కవాటాలను తెరచి, మనోచేతనను జాగృతం చేసి మీరు అర్థంచేసుకోవడానికి, ఆలోచించ డానికి అరుదెంచిన ఫర్మానా అది. ఇహంలోనూ, పరంలోనూ మీ మార్గం సుగమం చెయ్యడమే దాని పరమార్థం. మీరు ఆలోచించడానికి, అనుస రించడానికి సిద్ధంగా లేరా?

**వీరు కుర్ఆన్‌పట్ల చింతన చెయ్యలేదా, లేక వీరి హృదయాలపై తాళాలు పడి ఉన్నాయా? (47 : 24)**

అంతేగా మరి, ఇలాంటి మహత్తర జ్ఞాననిధి ద్వారా ప్రాప్తమైన సూచనలను గురించి లోతుగా ఆలోచన, అనుశీలన జరపకపోతే హృదయాలకు తాళాలు పడినట్లే కదా అర్థం!

"మీ ఇంటి గదుల్లో అనేక స్విచ్చులున్నట్లే మీ మనోమందిరానికీ ఎన్నో మీటలున్నాయి. దివ్య గ్రంథం కర్ణపేయంగా విని, నేత్రానందంగా కని సంబరపడే స్విచ్‌ని కాదు, భయభక్తులతో విధేయతకు, ఆజ్ఞాపాలనకు సమాయత్తపరిచే మీటను నొక్కండి– జీవితాశయం సిద్ధిస్తుంది."

– *షేఖ్ అలీ తంతావీ*

*(జూన్, 1987)*

# 4

**ఇది శుభాల** సరోవరం, సౌభాగ్యాల సోపానమేకాని దౌర్భాగ్యానికి, దారిద్ర్యానికి, దీనావస్థకు, క్షీణావస్థకు కారణం కాదు. ఇది విశ్వప్రభువు, సర్వోపరిజ్ఞాని, అనంత శక్తిసాగరుడు- దైవం పంపిన మార్గదర్శక గ్రంథం.

జీవితాన్ని అన్ని కోణాల నుండి సర్వ శోభాయమానంగా అలంకరించడానికి అరుదెంచిన దైవప్రబోధం, అనుక్షణం అడుగడుగునా హెచ్చరిస్తూ, సూచనలిస్తూ, మార్గం చూపుతూ ఉంటే జీవన చిత్రం ఎంత అందంగా రూపొంది ఉండాలి!

దివ్యవచనాస్త్రం తన అండనుండగా ఏ జాతీ దాస్యశృంఖలాలలో బందీ అయి పరాభవ భారంతో క్రుంగిపోతూ, పరాధీనతాపీడనలో అణగిపోతూ బ్రతకవలసిన అవసరం లేదు. ఒకరి అధికార పాదాల క్రింద నలిగిపోవడం, ఒకరి చెప్పుల చిరుచప్పుడుకే ఎగిరిపడడం ఆత్మాభిమానం, ఆత్మగౌరవంగల ఏ జాతి లక్షణమూ కాదు. బానిసత్వపు కళ్ళెం మెళ్లో వేసి, ఇతరులు ఎటుపడితే అటు తోలుకుపోతూ ఉంటే పశువుల్లా నోరుమెదపక తలవంచుకుపోతూ ఉండడం దైవజ్ఞానమున్న ఏ జాతికీ శోభించదు.

ఒక జాతి వద్ద మానవ రుగ్మతలన్నింటికీ దివ్య ఔషధం ఉంది కానీ

వ్యక్తులుః

మార్గవిహీనులయి, గమ్యశూన్యులయి, ఆచరణహీనులయి, అచేతనా నిశీథిలో, అజ్ఞాన అగాధాల్లో, అనామకావస్థలో పడి ఉన్నారంటే అర్థంఏమిటి?

ఒక జాతి వద్ద యావత్తు మానవాళినే ఏకం చెయ్యగల గొప్ప పథకం, ప్రపంచానికే మార్గం చూపగల దివ్య తేజం ఉంది కానీ ఆ జాతిః

అనైక్యతారోగానికి ఆలవాలమయి, పనిలేని సైన్యానికి ప్రతీక అయి, సంతలోని సరకుగా సరసమయి అలరారుతున్నదంటే భావమేమిటి??

ఆ జాతి తన మహత్తును గుర్తించలేదు. తన వద్దనున్న వరాల సరోవరాన్ని ఆదరించలేదు. ఈ అలక్ష్యం, ఈ ఉపేక్షాభావాలకు చోటివ్వడమే ఆ జాతి చేసిన ఘోర అపరాధం! ఫలితం?

**కడకు, పరిస్థితులు ఏ మేరకు దిగజారాయంటే, పరాభవం, పరాధీనత, దారిద్ర్యం, దౌర్భాగ్యాలు వారిపై లిఖ్త వేశాయి. వారు దైవాగ్రహానికి గురయ్యారు. ఇదంతా వారు అల్లాహ్ వచనాలను తిరస్కరించిన దాని ఫలితం....** ***(2 : 61)***

చూశారా! అల్లాహ్ ఆయతీల ద్వారా అందించిన ఆదేశాలను తిరస్కరించినవారి గతి ఏమయిందో? ఎంతో నీచులుగా, దరిద్రులుగా జీవించడమే కాక దైవాగ్రహం వారిని చుట్టుముట్టింది. ఈ ఫలితాలను మనం నేడు కళ్ళారా చూడటం లేదా?

(జులై, *1987*)

# 5

**దైవ గ్రంథం,** దైవ మార్గదర్శకత్వం, దైవ విధేయమయిన జీవన పథం– ఈ మాటలన్నింటి సారాంశమే ఇస్లామ్!

దైవం సమక్షంలో ఆత్మసమర్పణ చేసుకోవడం, దైవాదేశాలను శిరసా వహించడం, దైవాజ్ఞల్ని పాలించడం, దైవాధికారం ముందు తన స్వతంత్రతను, అధికారాన్ని వదలుకోవడం– ఇదేకదా ఇస్లామ్ అంటే!! దేవుని సర్వాధికారం, ఆయన సర్వతోముఖ ప్రభుత సమక్షంలో తలవంచడం కాక ఇస్లామ్ అంటే అర్థమేమిటి?

తల్లి ఒడిలో పసిపాప పెంపకమయినా, బడిలో పంతులు చెప్పే చదువులయినా, ఇంటిలోని ఇల్లాలి గొడవలయినా, నడి వీధిలో మనిషి నడవడి అయినా, బజారులో చేసే బేరాలయినా, బ్రతుకుతెరువు కోసం పడే పాట్లయినా, ఏలికలు సాగించే రాచపనులయినా – అన్నింటినీ ఆ దేవునికి అప్పగించినవాడే కదా ముస్లిమ్! పనులన్నీ తన మాట మీదుగా జరుపుకునేవాడు లేక దేవుణ్ణి కాదని, వాటి బాధ్యతను ఇతరులకప్పగించేవాడు, ఇతరులకు నచ్చిన తీరులో నడచుకునేవాడు ముస్లిమ్ ఎలా కాగలడు?

దేవునికి అప్పగించడమంటే, ఆయన ఎదుట తలవంచడమంటే దైవం తన దివ్యగ్రంథంలోను, తన సందేశహరుని ద్వారాను తెలిపిన, ఆయనకు ఇష్టమయిన ప్రబోధాన్ని స్వీకరించడం, ఆయన ప్రసన్నుడయ్యే మార్గాన్ని అనుసరించడం, ఈ మార్గానుసరణలో ఎలాంటి ఊగిసలాట లేకుండా, ఏకోన్ముఖుడయి ప్రవర్తించడం అన్నమాట.

మక్కా మహానగరంలో తొలి దైవ గృహమయిన కాబా గృహాన్ని నిర్మించిన హజ్రత్ ఇబ్రాహీమ్ చేసింది ఇదే. ఆయన అనుసరించిన దైవ విధేయతా

మార్గాన్ని, ఆయన చేసిన త్యాగాలను మననంచేసుకోవడం కూడా హజ్ ఉద్దేశాల్లో ఒకటి. ఆయన గురించి దైవ గ్రంథం ఏమంటోంది?

**వాస్తవంగా ఇబ్రాహీమ్ తనంతటతాను ఓ సముదాయం, దైవాజ్ఞాబద్ధుడు, ఏకాగ్ర చిత్తుడు ... *(16 : 20)***

అవును, ఆయన తానే ఒక సంఘం, ఏకోన్ముఖుడయి దైవాజ్ఞాపాలన చెయ్యడంలో ఆయనకు ఆయనే సాటి, అందుకే ఆయన చేసిన త్యాగాలకు గుర్తుగా కుర్బానీని నిత్యనియమంగా హజ్‌లో భాగంగా, చేశాడు పరమ ప్రభువు.

*(ఆగస్టు, 1987)*

# 6

**ఈ విశ్వానికి** ఓ కర్త ఉన్నాడు. ఆయనే దానికి స్వామి. ఆయనే దానికి ప్రభువు, పరిపాలకుడు, పోషకుడు. మనకూ, మనకు చెందిన ప్రతిదానికీ యజమాని ఆయనే. కాళ్ళూ చేతులు, కళ్ళూ చెవులు మనసూ మస్తిష్కం- సర్వం ఆయనవే. పశువులూ పరికరాలు, సిరులూ సాధనాలు- సమస్తం ఆయనవే. ఏదీ మనది కాదు, ఇవన్నీ కేవలం అమానతుగా అప్పగించబడ్డాయి మనకు. వీటిని ఆ స్వామి ఆజ్ఞల సరిహద్దుల్లో, ఆదేశాల పరిధుల్లో, బోధనల పద్దుల్లోనే వినియోగించుకోవాలి. ఆయన అభీష్టానికి వ్యతిరేకంగా వినియోగించడమంటే అది మోసం, వంచన, నమ్మక ద్రోహం క్రిందికి వస్తుంది.

ఆయన అభీష్టం ప్రకారం ఆచరించడం వల్ల మనకు అప్పగించబడిన వాటికి ఏదయినా నష్టం కలిగితే కలగనివ్వండి; ఆయన మార్గంలో కాళ్ళూ చేతులూ విరిగినా, ధనధాన్యాల నష్టం కలిగినా, భార్యాబిడ్డల్ని కోల్పోవలసి వచ్చినా, చివరికి ప్రాణాలు ధారపోయవలసివచ్చినా పోనివ్వండి. మన కెందుకు? ఇవన్నీ ఎవరి సొత్తుగా మనం భావిస్తున్నామో ఆయనే వీటిని నష్ట పరచదలిస్తే, ఆయనకు ఆ హక్కు ఉంది.

అవును, ఒకవేళ ఆయన అభీష్టానికి వ్యతిరేకంగా ఆచరించి మనం మనకు అప్పగించబడిన వాటిలో దేనిని కోల్పోయినా, దేనికి నష్టం కలిగించినా అది మహాపరాధం, ఘోరమయిన నమ్మక ద్రోహం.

నిజమే, స్వామి ప్రసాదించిన దాన్ని ఆయన మార్గంలో వినియోగిస్తే అందులో గొప్పదనమేముందీ? అది ఎవరికి ఉపకారం? మనం మన కర్తవ్యాన్ని నిర్వర్తించామన్నమాట. ఈ విధి నిర్వహణలో, ఈ స్వామి మార్గంలో, ప్రాణాలు త్యాగం చెయ్యవలసివచ్చినా అది మనం మనకు

చేసుకున్న మహోపకారమేకాని మరేమీ కాదు. ఈ సందేశాన్నే ప్రవక్త మహనీయుల మనుమడు, అమరగతులలో కలికితురాయి హజ్రత్ సయ్యిదినా ఇమామ్ హుసైన్ ముహర్రం పదవ దినాన అందజేశారు.

**నిజానికి అల్లాహ్, విశ్వాసులనుండి వారి ప్రాణాలను, వారి సంపదల్ని స్వర్గానికి బదులుగా కొనివేసుకున్నాడు.... *(9 : 111)***

ఎంత ఉదారుడు విశ్వ ప్రభువు! తాను తన దాసులయిన మానవులకు ప్రసాదించిన ధనప్రాణాలను తన మార్గాన వెచ్చించమని చెప్పి, ఆ కృషిలో ప్రాణాలను సయితం ధారవోసిన తన దాసులకు, ఆ ప్రాణత్యాగానికి మూల్యంగా స్వర్గాన్ని ప్రసాదిస్తానని హామీనిస్తున్నాడు!

ముహర్రమ్ నెలలో 'పండుగ' జేసుకునేవారు ఈ సందేశాన్ని, ఈ అమరవాణిని గుర్తుంచుకుంటే ఎంత బాగుండు!

*(సెప్టెంబరు 1987)*

# 7

**అందరూ దైవాన్ని** విశ్వసించినవారే. అందరి ఆంతర్యాల్లోనూ దైవభక్తి మధుపాత్ర పొంగి పొరలుతూనే ఉంది. అందరూ దైవ ప్రేమామృతం గ్రోలినవారే. దైవధ్యానపరాయణతలో పరవశులయి స్వాప్నిక జగత్తులో స్వర్గవిహారం చేసేవారే మనలో అధికం. భూమ్మీద కాలుమోపి, కళ్ళు తెరచి, దైవ విశ్వాసం, దైవభక్తి వల్ల మనకు ఆసన్నమయిన బాధ్యతలేమిటో, మన కర్తవ్యమేమిటో ఆలోచించడానికి, దైవ సంస్మరణలో విలీనమయి ఉన్న మనకు, అవకాశమూ లభించదు, వ్యవధీ దొరకదు.

భక్తి ప్రేమలు కేవలం మానసికమయిన వృత్తులే కావు. వాటికి శారీరక ప్రవృత్తులతోనూ సంబంధముంది. దైవ భక్తి, దైవప్రేమ గల మనిషి ఆంతర్యం ఉజ్వలంగా, నిష్కల్మషంగా విలసిల్లడమేకాక, దయ, క్షమ, ప్రేమాదిగుణాలతో కూడా విరాజిల్లుతుంది. త్యాగం, సహనం, సౌశీల్యం, నిస్వార్థతలు అలాంటి వ్యక్తిలో పుష్కలంగా వ్యక్తమవుతాయి. భోగలాలస, ఈర్ష్యాద్వేషాలు, క్రోధావేశాలు, ఆశామోహాలు అతని దరిచేరవు. అందువల్ల అతని ఆచరణ కూడా అతని ఆంతరంగిక భావాలకు అద్దం పట్టేలా, అతని ఆలోచనా విధానానికి తార్కాణంగా ఉంటుంది.

దేవుడు తన భక్తులు, దాసుల నమ్మకాలకే కాదు, ప్రవర్తనలకు కూడా మార్గం చూపాడు, ఆలోచనలకే కాదు ఆచరణలకు సయితం దారి చూపాడు. విధానాలు, సిద్ధాంతాలే కాదు క్రియాశీలకమయిన ఆదర్శాలూ నిలిపిచూపాడు.

ఆ క్రియాశీలక ఆదర్శాలు మనిషి పుడమిపైన కాలుమోపిన నాటి నుండి అతని ముందు నిలిచి అతను నడవవలసిన బాట ఏదో, అతను చేరవలసిన గమ్యమేదో విడమరచి చెబుతూ వచ్చాయి. అలాంటి ఆదర్శాలు మనిషి

అన్నవాడు నివసించిన ప్రతి భూభాగంలోనూ ప్రభవించాయి. దైవమార్గాన్ని తోటి మానవసోదరులకు బోధించాయి. అలాంటి అంతిమ ఆదర్శం మహనీయ ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం)లో మనకు దర్శన మిస్తుంది. మానవాళి దైవ ప్రేమకు, దైవ భక్తికి ప్రతిరూపంగా నిలవాలంటే ఆయన్ని అనుసరించడం తప్ప గత్యంతరం లేదు.

**ప్రవక్తా ప్రజలకు చెప్పివెయ్యండి, "మీరు నిజంగానే దైవాన్ని ప్రేమించే వారయితే నన్ను అనుసరించండి, అల్లాహ్ మిమ్మల్ని ప్రేమిస్తాడు, మీ తప్పిదాలను మన్నిస్తాడు. ఆయన మహా క్షమాశీలి, కరుణా స్వరూపి.**

***(3 : 31)***

చూశారా?! దైవాన్ని ప్రేమించడానికి, ఆయన పట్ల భక్తి ప్రతిపత్తులు కలిగి ఉండటానికి గీటురాయి ఆయన సందేశహరుని అనుసరణ అట! అంతేకాదు దైవ ప్రేమకు తార్కాణంగా ప్రవక్తను అనుసరిస్తే దైవ ప్రేమ ప్రాప్తమవుతుంది, ఆయన క్షమాశీతలం లభ్యమవుతుంది. అపరాధాల ప్రక్షాళన జరుగుతుంది. ఎప్పుడూ? ప్రపంచంలో ఆచరణరంగాన దేవుని ప్రవక్త మహనీయ ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం)ను ఆదర్శంగా తీసుకుని అనుసరించినప్పుడు, అనుకరించినప్పుడు.

(నవంబర్, 1987)

# 8

ప్రపంచంలో మానవుల మధ్య ఎప్పుడు, ఎక్కడ కలతలు, కలహాలు చెలరేగినా, వైమనస్యాలు, వైషమ్యాలు పెరిగినా దానికి కారణం సదా ఒక్కటే - దుర్మార్గం, దురభిమానం, దురహంకారం, భాషావైషమ్యం, దేశం, ప్రాంతం, వంశం, వర్ణాల దురభిమానం, సంకుచిత జాత్యహంకారం.

"నా భాష అత్యంత ప్రాచీనమయిన ద్రావిడభాష, అందువల్ల అన్నింటికంటే గొప్పది. నా సంస్కృతి అంతకంటే పురాతనమయింది, అందువల్ల అన్నీ దానికి దాసోహమనవలసిందే. మా జాతి ప్రపంచంలో అత్యంత గొప్ప నాగరికతకు చిహ్నం, మేము మహా గొప్ప ఫిరౌనుల సంతానం. మేము ప్రపంచంలోనే గొప్ప నాగరిక జాతి అయిన ఆర్య జాతికి చెందినవారం, అందువల్ల యూదుల్ని అల్పులయిన అనార్యుల్నీ చీల్చి, చెండాడుతాము. మేము 'ఆర్యా మెహర్' అన్న బిరుదును సగర్వంగా వాడుకుంటాము. మాది సూర్య వంశం, గొప్ప చక్రవర్తుల వంశం. మాది చంద్ర వంశం మహాగొప్ప రారాజుల వంశం. మేము తెల్లజాతివారము. మేము విజ్ఞానసంపన్నులము. ప్రపంచాన్ని ఏలే అర్హత, అధికారం మాకు మాత్రమే ఉన్నాయి."

ఇలాంటి నినాదాలు, ఉద్ఘోషణలు - మూలకారణమయిన ఆ దురభిమానం, దురహంకారంలో నుండి ఉద్భవించినవే. ఇవన్నీ అసత్యపు నినాదాలు, అబద్ధపు ప్రలాపనలు. వాస్తవం మాత్రం ఇదే! మానవులంతా ఎన్ని శాఖోపశాఖలుగా విస్తరించినా ఒకే స్త్రీ పురుషుల జంట ద్వారా ఉనికిలోకి వచ్చిన వారే.

ఒకే మూలం నుండి విస్తరించినా మానవాళి ప్రకృతి సిద్ధంగా అనేక రంగుల్లో, తెగల్లో, జాతుల్లో విడిపోయింది. ఈ సహజ పరిణామాలు మనుషుల్లో నిమ్నోన్నతభావనలకు, హెచ్చుతగ్గులకు, భేదభావాలకు, శ్రేష్ఠులూ, నీచులూ

అనడానికి ప్రమాణాలు కారాదు. మీలో వంశం, వర్ణం, వర్గం ఇత్యాది వ్యత్యాసాలు కేవలం మీరు పరస్పరం ఒకరినొకరు పరిచయం చేసుకోడానికి, ఒకరినొకరు గుర్తించడానికేగాని గర్వపడడానికి, ఒకరిని నీచులుగా, మరొకరిని ఉన్నతులుగా భావించడానికి కాదు.

నిజానికి మానవుల మధ్య వ్యత్యాసం చూపగల ప్రమాణం, మానవుల్లో ఎవరు ఉన్నతుడు ఎవరు నీచుడు అని తెలుసుకోడానికి గీటురాయి ఏదయినావుంటే అది కేవలం నైతికమయింది మాత్రమే.

నైతికంగా ఉన్నతుడయినవాడే మానవుల్లో ఉత్తముడు. అతడు నల్లవాడయినా, తెల్లవాడయినా, ఆర్యుడైనా, అనార్యుడయినా, అరబీ మాట్లాడేవాడయినా, ఇంగ్లీషువాడయినా సరే.

***మానవులారా, మేము మిమ్మల్ని ఒక స్త్రీ పురుషుల జంట ద్వారా పుట్టించాము. తరువాత మిమ్మల్ని జాతులుగా వంశాలుగా చేశాము, తద్వారా మీరు ఒకరినొకరు గుర్తుపట్టగలగాలని. వాస్తవానికి దైవం దృష్టిలోనయితే, మీలో అందరికన్నా అధికంగా చెడులకు దూరంగా ఉండేవాడే ఆదరణీయుడు. (49 : 13)***

అందువల్లనే దేవుని అంతిమ సందేశహరుడు (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా అన్నారుః

జనులారా, తెలుసుకోండిః మీ అందరి దేవుడు ఒక్కడే. అరబ్బులకు అరబ్బేతరులపైగాని, అరబ్బేతరులకు అరబ్బులపైగాని, తెల్లవానికి నల్లవానిపైగాని, నల్లవానికి తెల్లవానిపైగాని ఎలాంటి ప్రాధాన్యత లేదు. అత్యధిక భయభక్తులు గలవాడే దైవం దృష్టిలో గౌరవనీయుడు.

*(డిసెంబర్, 1987)*

# 9

**కాలానిది రాతి గుండె.** అది సులువుగా కరగదు. సులభంగా చలించదు. అన్నింటినీ సహించినా ఎవ్వరినీ క్షమించదు. ఎందరినో పరీక్షిస్తుంది. మరెందరినో శిక్షిస్తుంది. అంతా వీక్షిస్తూనే ఉంటుంది. కాని ఎవరికోసమూ నిరీక్షించదు. దాని నిరంతర పయనంలో మలుపులేకాని మజిలీలు లేవు. అంతులేని దాని బాట నిండా ఎగుళ్ళు దిగుళ్ళు, గతుకులూ గోతులూ ఎన్ని ఉన్నా అది ఆగటంగాని, అలసట చెందడం గాని ఎక్కడా ఉండదు. మైలు రాళ్ళు అసంఖ్యాకమయితే ముఖ్య ఘట్టాలు కూడా తక్కువేమీ కావు.

కళ్ళున్నవారికి 'గతం' ఉజ్వలమయిన, దేదీప్యమానమయిన కాంతి క్షేత్రం. అందులో ఎన్నో చెరగని దృశ్యాలు. గగనతలానికెక్కిన సంస్కృతీ సభ్యతలు అధఃపాతాళానికి దిగజారి, క్రుంగి, నామరూపాల్లేకుండా సమసిపోయిన గాధలు; చీకటి అఖాతాల్లోనుంచి తలపైకెత్తి విజృంభించి సర్వాన్నీ ఆక్రమించుకున్న నాగరిక సమాజాల కథనాలు- ఎన్నో, ఎన్నెన్నో!

'వర్తమానం' అనుక్షణం చలనానికి, నిరంతర చైతన్యానికి క్రియాశీల జీవనానికి ప్రతీక. ఆవేశమున్నా, అనురాగమున్నా, జీవితం పట్ల ఉన్మాదమున్నా, మాటల్లో వాడి ఉన్నా చేతల్లో వేడి ఉన్నా చూపుల్లో వేగిరమున్నా- అది అరుణోదయ ప్రశాంతతకులోనైనా శ్యామసుందర సంధ్యాంధకారంలోనైనా పగటి హడావిడిలోనైనా - ఒక్క వర్తమానంలోనే సాధ్యం!

'రేపు' తెల్లని కాన్వాసు. అందులో అంతులేని ఆశల తరగని ఐశ్వర్యం ఉంది. బాధ ఉంటే బాధకు ఉపశమనమూ ఉంది. సుఖం ఉంటే సుఖానికి కళ్ళెమూ

ఉంది. శక్తి, శక్తికి తగిన ఆసక్తి ఉంటే తీరంలేని సాగర తరంగమూ ఉంది. ఊహల్లోకూడా లేని ప్రతిదీ ఉంది!

కేలండరు మారిపోయింది. 1987 'గతం' కాగా 1988 రూపంలో భవిష్యత్తు వచ్చి నిల్చున్నది. వర్తమానం కేవలం ఈ క్షణమేగా? మరుక్షణంలో 'ఈ క్షణం' గతమయిపోతుంది. రాబోయే క్షణం రేపుగా రూపొందుతుంది!

**ఇవి కాలపు మెట్టపల్లాలు, వీటిని మేము జనులమధ్య పరిభ్రమింపజేస్తూ ఉంటాము...... *(3 : 140)***

ఇవన్నీ కాలగమనంలోని మెట్టపల్లాలే, సందేహం లేదు. వీటిని మన మధ్య భ్రమింపజేస్తున్న ఆ విశ్వవిధాతకే తెలుసు, మనలో ఎవడు తన గత సౌధాన్ని ఎలా నిర్మించుకున్నాడో, ఎవడు తన వర్తమాన పథాన్ని ఎలా దాటుకుపోతున్నాడో, ఎవడు తన భావి ఉద్యానవనాన్ని ఎలా రూపకల్పన చేసుకుంటున్నాడో!

*(జనవరి, 1988)*

# 10

**మానవుని ఉనికి** మహోత్కృష్టమయింది. సృష్టి సర్వమూ ఒక ఎత్తయితే ఒక్క మానవుడే మరో ఎత్తు. సృష్టి సామ్రాజ్యంలోని ప్రచండ శక్తులన్నీ పృథ్వీమీది ఈ 'అల్ప' జీవి సేవ కొరకు మాత్రమే సృజించబడ్డాయా? నిజమే.

అత్యుత్తమ సృష్టిరాశికి విధాత అత్యున్నత స్థానమే ప్రదానం చేశాడు. తాను సృష్టించిన ఈ జీవికి ప్రపంచంలో ఆధికృతనే ఇచ్చాడు. దేనికీ అధీనం చెయ్యలేదు, మనిషిని తన ప్రతినిధిగా చేశాడు గనక! మానవుడు తన సొంత మానసిక దౌర్బల్యాలకు దాసుడు కారాదని మాత్రం అభిలషించాడు సృష్టికర్త.

అలాంటప్పుడు మానవుడు, నీచమయిన పైశాచిక శక్తులకు లొంగిపోవడాన్ని, అసత్యమయిన అస్తిత్వాలకు దాస్యం చెయ్యడాన్ని అంగీకరిస్తాడా ఆ మహోన్నత ప్రభువు? విశ్వవిరాట్టు ప్రతినిధి క్షుద్ర శక్తులకు ఊడిగం చెయ్యడమా??

స్వేచ్ఛా ప్రియత్వం మనిషి స్వభావగత లక్షణం. ఆ స్వేచ్ఛ లభించాలంటే, ప్రపంచంలో ఎక్కడా తలవంచకుండా ఎల్లెడలా నిటారుగా తలెత్తుకు తిరగాలంటే మనిషి తన నిజ ప్రభువు ప్రాతినిధ్యపు బంధనాలను, స్వామి సేవ, విధేయతల కాడినీ భుజాలపైన స్వచ్ఛందంగా ధరించాలి. అదే ఇహపరాల్లో విజయోన్ముఖ మార్గం.

విశ్వప్రభువుకు ప్రాతినిధ్యం వహించే మార్గాన్ని, విధేయతా మార్గాన్ని అనుసరించి, ప్రపంచంలో తనపైన ఆధిపత్యాన్ని ప్రకటించే ప్రతి శక్తినీ

ఎదిరించి పోరాడడానికి మనిషి సిద్ధంగా ఉన్నాడా లేక తన్ను లోబరచు కునేందుకు దాడిచేసే ప్రతి శక్తికీ దాసోహమంటాడా? అన్నదే అసలు పరీక్ష!

***ధర్మం విషయంలో ఎలాంటి ఒత్తిడి, బలవంతం లేదు. సరయిన మాటను తప్పుడు భావాలనుండి వేరు పరచడం జరిగింది. ఇక దైవేతర శక్తుల్ని తిరస్కరించి అల్లాహ్‌ను విశ్వసించిన వాడు ఎవడయినా ఒక స్థిరమయిన ఆధారాన్ని గట్టిగా పట్టుకున్నట్లే, అది మరెన్నటికీ తెగదు... (2 : 256)***

ఎంత ఉదారుడు ఆ స్వామి! ధర్మమార్గానుసరణలో ఎలాంటి బలాత్కారం లేదు. ఋజుమార్గమూ మార్గవిహీనతా ప్రస్ఫుటపరిచాడు. అసత్య దైవాలను తిరస్కరించి నిజస్వామిని నమ్ముకున్నవారు ఎన్నటికీ తెగని ఆధారాన్ని పట్టుకున్నట్లే. ఆ ఆధారం అజ్ఞానపు అంధకారాల అగాధాల నుండి మనిషిని విజ్ఞానపు కాంతి శిఖరాలకు లేవనెత్తుతుంది.

*(ఫిబ్రవరి, 1988)*

# 11

**జీవితం అసంఖ్యాక** సంబంధాల నిలయం. సుందర సముచిత శరీరంలోని పొందికయిన సేవకులు- ఈ కళ్ళూచెవులు, కాళ్ళూచేతులు, మనస్సూ మేధస్సు, నోరూ కడుపు! వీటన్నిటి ద్వారా ఏ సేవ ఎలా చేయించుకోవాలో నిర్ణయించవలసింది మనిషే. ఈ సేవకులే మనిషిస్థాయి, స్వరూపస్వభావాల నిర్ణేతలు, నిర్మాతలు! ఇవి మనిషిని మానవతా శిఖరాల అత్యున్నత స్థానానికీ లేవనెత్తగలవు, జంతుజాలం కన్నా, క్రిమికీటకాల కన్నా అధమగతికీ తొక్కివెయ్యగలవు.

మనిషి దివారాత్రులు, మమతానుబంధాలు తల్లిదండ్రులతో, సోదరీసోదరులతో, భార్యాపిల్లలతో పెనవేసుకుని ఉన్నాయి. వీరందరితో మనిషి బాంధవ్యవాహిని ఎలా సాగుతుంది? వారిపట్ల తన బాధ్యతనావను మనిషి ఎంత సంతులనంతో ముందుకు తీసుకువెడుతున్నాడు?? ఈ ప్రశ్నల సమాధానాలే మనిషి జీవితాన్ని, ఇహంలోనూ, పరంలోనూ స్వర్గధామం చెయ్యగలవు, నరకతుల్యమూ చెయ్యగలవు.

అంతేకాదు, ప్రపంచంలో నలువైపులా మనిషికి ఏదో ఓ విధంగా, ఏదో ఓ సందర్భంలో, ఎక్కడో' ఎప్పుడో తారసపడే అనేక వ్యక్తులతో, వర్గాలతో, సంస్థలతో, సంఘాలతో మనుగడ ముడిపడే ఉంటుంది. ప్రపంచంలో ప్రశాంత జీవితం గడపాలంటే, పరలోకంలో ఆనందామృతం ఆస్వాదించాలంటే ఈ సంబంధాలన్నింటినీ సవ్యంగా, సక్రమంగా, బాధ్యతాయుతంగా నిర్వర్తించడం అవసరం.

ఈ సందర్భాలన్నింటిలో మనిషి ఎలా నడచుకోవాలి? ఎవరితో ఏవిధంగా వ్యవహరించాలి? మనిషి అనుదిన జీవితంలో అడుగడుగునా ఎదురయ్యే

ప్రశ్నలకు ఎటువంటి నిర్ణయాలు గైకొనాలి? మేలు కలిగించే నడవడి ఏది? కీడు కలిగించే విధానాలేవి?

మనిషి మనసును గురించి అడిగితే అది కోరికల బందీ, కాంక్షల దాసి, స్వార్థం నిండిన కొంప- అన్నీ అపమార్గాలే చూపుతుంది. తోటి మనుషుల్ని మార్గం చూపమందామా అంటే వారూ బలహీనులే, తామూ గోతిలో పడతారు, ఇతరుల్నీ పడవేస్తారు. వీలయితే తమ కోరికల పరిపూర్తికి ఇతరుల్ని పనిముట్లుగా చేసుకుని ప్రపంచమంతా విలయతాండవం ఆడగలరు. అయితే ఇక దారి చూపేదెవరు?

***అల్లాహ్, విశ్వసించిన వారి సంరక్షకుడు, సహాయకుడు, మరాయన వారిని చీకట్లనుండి వెలికి తీసి వెలుగులోకి తీసుకువస్తాడు. (2 : 257)***

నమ్మినవారిని కనిపెట్టుకుని ఉండే స్వామి, సృష్టికర్త అల్లాహ ఒక్కడే. ఆయనే మనిషి మనుగడకు సరయిన మార్గం చూపుతాడు. అజ్ఞానపు అంధకారాల నుండి వెలికి తీసి జ్ఞానకాంతులతో జీవితాన్ని జ్యోతిర్మయం చేస్తాడు. ఇహంలోనూ, పరంలోనూ తోడుగా నిలుస్తాడు. జీవితాన్ని ఆనందాల సుందరవనం చేస్తాడు.

(మార్చి, *1988*)

# 12

**శుభాల శ్రావణమయి,** ప్రకాశతోరణమయి, కారుణ్యవారుణియై, వరాల వాహినియై, నిశాంత ప్రశాంతతలో ప్రభాత గీతికయై, విశ్వాసజన సమాజానికి చైతన్యదీపికయై అరుదెంచింది రమజాన్ నెల.

విశ్వాసమే సజీవంగా ఉంటే ఆత్మవికాసానికి అంతరాత్మ పరితపిస్తూ ఉంటుంది, ఆత్మ పరిశుద్ధత, ఆత్మ పరిశోధన, ఆత్మపరిశీలనకు మార్గాలు వెదుకుతుంది. ధర్మపథాన పయనించడానికి శక్తి, సంయమనం కావాలని కోరుకుంటుంది; త్యాగం, సహనం, స్థయిర్యం, నిగ్రహం నరనరాల్లో జీర్ణించుకుపోవాలని, ఉచ్ఛ్వాసనిశ్వాసాల్లో కరిగిపోవాలని ఉవ్విళ్ళూరుతుంది. ఈ అంతరాత్మ తపనకు సమాధానమే రమజాన్.

ఇహంలోనే పరాన్ని అన్వేషించడం, భోగిగానే యోగజీవనాన్ని సాధించ గోరడం, ప్రపంచంలోనే పరలోకాన్ని నిర్మించదలచడం, భువిలోనే దివి తేజాన్ని ఆశించడం సమగ్ర ధార్మిక దృష్టికి నిదర్శనం. ఆ జీవన పథగామియే పరిణిత మానవాత్మ. ఆ మార్గదర్శకత్వమే ఖుర్‌ఆన్ ప్రబోధం. ఆ ఖుర్‌ఆన్ అవతరించిన నెలే రమజాన్ నెల.

కొండల్ని రగిలించే మహాజ్వల వాణి ఖుర్‌ఆన్ వాణి. పాషాణ హృదయాలను మార్దవంతో నింపే సురభిళ అమృతం ఖుర్‌ఆన్ సందేశం. సమస్త దాస్య శృంఖలాల పరిచ్ఛేదానికి నైశిత్య కరవాలం ఖుర్‌ఆన్ ప్రబోధం. సకల లోక సామ్రాట్టు పట్ల భక్తి విశ్వాసాల ఉన్నతాసనం ఖుర్‌ఆన్ మార్గదర్శనం. సర్వ మానవ సౌభ్రాత్ర క్షేత్రం ఖుర్‌ఆన్ జీవన నియమం. ప్రేమానురాగాల అసీమిత మహా సాగరం కుర్‌ఆన్ జ్ఞానసారం. జీవన సమస్యలన్నింటికీ సమగ్ర పరిష్కారం ఖుర్‌ఆన్ ధర్మపథం.

ఖుర్ఆన్ ప్రబోధానికనుగుణంగా మనిషిని మలచడానికి, దాని బోధనల వెలుగులో మనిషి శీలాన్ని తీర్చిదిద్దడానికి, మనిషికి తర్ఫీదునివ్వడానికి అది (ఖుర్ఆన్) అవతరించిన రమజాన్ నెలని ప్రత్యేకించడం జరిగింది. ఖుర్ఆన్ బోధించే ఈ జీవిత విధానాన్నే "తక్వా" అని, నిష్ఠాగరిష్ఠ జీవితమని అంటుంది ఖుర్ఆన్. ఖుర్ఆన్ మార్గదర్శి మాత్రమే కాదు. సత్యాసత్యాలను ప్రస్ఫుటపరిచే, మంచీ చెడులను వేర్వేరు చేసి చూపే గీటురాయి కూడా అంటుంది ఖుర్ఆన్.

***రమజాన్, కుర్ఆన్ అవతరింపజెయ్యబడిన నెల. అది మానవులకు ఆసాంతం మార్గదర్శకం, అది విశదమయిన బోధనలుగల గ్రంథం, ఆ బోధనలు రుజుమార్గాన్ని చూపుతాయి, సత్యాసత్యాల వ్యత్యాసాన్ని విడమర్చి తెలుపుతాయి. మీలో ఆ నెలను కానగలిగిన వారు తప్పనిసరిగా ఆ నెల పూర్తిగా రోజా పాటించాలి. (2 :185)***

ఖుర్ఆన్ అవతరించిన ఆ నెలలో మానవాళికి మార్గదర్శకత్వం వహించిన గ్రంథాన్ని, మంచీ చెడుల్ని, సత్యా సత్యాలను ప్రస్ఫుటం చేసిన ప్రామాణిక బోధనల్ని అర్థం చేసుకోవడానికి మనిషి ఎంత వరకు ప్రయత్నిస్తున్నాడు? ఆ నెలను కన్నవారు ఉపవాస వ్రతాన్ని పాటించి ఖుర్ఆన్ ప్రతిపాదించిన నిష్ఠాగరిష్ఠజీవితాన్ని అలవరచుకునేందుకు సహనం, స్థయిర్యం, సంయమనం, త్యాగంలాంటి ఉత్తమ లక్షణాలను పెంపొందించుకునేందుకు ఎంతగా పరిశ్రమిస్తున్నారు?

(ఏప్రిల్, 1988)

# 13

**మనిషి ఊహకు** అంతుపట్టని దూరాలకు క్షణం క్షణం విస్తరిస్తూ పోతున్న ఈ అనంత విశ్వంలో నిరంతర ప్రస్థాన సంరంభంతో ఎక్కడికో తరలివెడుతున్న కోటానుకోట్ల గ్రహాలు, నక్షత్రాలు వందలకొద్ది పాలపుంతలు నెరవేరుస్తున్న కర్తవ్యమేమిటి? ఇవి లక్ష్యరహితంగా మార్గవిహీనంగా, గమ్యశూన్యంగా సంచరిస్తూ ఉంటే వీటి మధ్య ఎన్ని ఘర్షణలు, సంఘర్షణలు తలెత్తేవి? విశ్వంలో ఎన్ని ఉపద్రవాలు సంభవించేవి? లక్షలాది సంవత్సరాలుగా సాగుతున్న అంతం ఎరుగని ఈ పయనంలో ఎన్ని ప్రళయాలు ప్రకోపించేవి?! ఇంతటి మహత్తరమయిన జగత్తులోన తిరుగుతున్న ఓ చిట్టి బొంగరంపై నివసిస్తున్న ఈ మనిషి ఇలా సుఖంగా కాలం వెళ్ళదీస్తూ ఈ విశ్వాన్నే జయించి మొత్తాన్నీ తన ఉచ్చులో బిగించి అంతటా రాజ్యమేలాలని కలలు కనగలిగేవాడా?

విశ్వప్రస్థానం గమ్యరహితం, గమన హీనం కాదు. ప్రచండమయిన నిబద్ధత, శక్తిమంతమయిన క్రమశిక్షణ ఇందులో ఉంది. ఈ బ్రహ్మాండ వ్యవస్థను తన అండదండలతో నడుపుతున్న ఆ మహామహిమాన్విత శక్తికంటే ఆదరణీయ మయిన, గౌరవనీయమయిన, పూజనీయమయిన అస్తిత్వం మరేది కాగలదు? జగత్తు అంతా ఆత్మార్పణం చేసుకున్న ఆ శక్తి సన్నిధానంలో మనసు దానంతట అదే మోకరిల్లాలని పరితపిస్తుంది. ఆ శక్తి మెచ్చుకోలు కోసం, అది ఇచ్చే బహుమానాల కోసం అర్రులుచాచి నిరీక్షిస్తుంది.ఆ శక్తి ఆగ్రహ తాపానికి జరిగే వినాశాన్ని తలచుకుంటేనే వణికిపోతుంది.

విశ్వ వ్యవస్థలో అణువణువునా కానవచ్చే క్రమబద్ధత ఒక్క మనిషి జీవితంలోనే కరవయిందా? విశ్వమంతా దాన్ని పరిపాలించే శక్తి అధీనంలో సామరస్యపూర్వకమైన మనుగడ సాగిస్తుంటే ఈ చిట్టి పొట్టి జీవి మనిషి,

తన ఇష్టారాజ్యం సాగాలని ఉవ్విళ్ళూరుతున్నాడా? విశ్వమంతా దాని లక్ష్యసాధన వైపునకు నిరంతర పయనం కొనసాగిస్తుంటే మానవుడనే బుద్ధి జీవి లక్ష్యశూన్యమయిన మనుగడ కోసం తహతహలాడుతున్నాడా? విశ్వ వ్యవస్థతో సామరస్యం సాధించి నడవకపోతే, క్రమశిక్షణకు వ్యతిరేకంగా ఆచరిస్తే ఈ వ్యవస్థతో ఘర్షణ తప్పదని మనిషికి తెలియదా?

మనిషి బ్రతుకులో శాంతి, సామరస్యం లోపించిందంటే దానికి కారణం మనిషి అనుసరించే ఈ వైఖరేనేమో! విశ్వవ్యవస్థ అంతా ఓ బాటలో పయనిస్తుంటే మనిషి తనదంటూ ఓ కొత్త దారిని నిర్మించుకుని ఈ చిక్కులను కొనితెచ్చుకున్నాడేమో!!

**అయితే వీరు దైవ విధేయతా విధానాన్ని (దైవధర్మాన్ని) కాదని మరే విధానాన్నయినా కావాలని కోరుకుంటున్నారా? వాస్తవానికి భూమ్యాకాశాల్లో ఉన్నవన్నీ ఇష్టమున్నా లేకపోయినా దైవాజ్ఞాబద్ధమయి (ముస్లిములయి) మాత్రమే ఉన్నాయి. ఆయనవైపునకే అందరూ మరలిపోవలసి ఉంది.**

***(3 : 83)***

వాస్తవానికి మనిషి విశ్వప్రభువును కాదని ఇతర శక్తుల ఆజ్ఞాపాలన, దాస్యం చెయ్యదలచినప్పుడే అన్ని విపరీతాలు సంభవిస్తాయి. ఎందువల్లనంటే భూమ్యాకాశాల్లోని సమస్త వస్తువులు కేవలం ఆ ప్రభువుకే దాస్యం చేస్తున్నాయి. ఆయన ఆజ్ఞలనే పాలిస్తున్నాయి. అవన్నీ చివరికి ఆ స్వామి వైపునకే మరలిపోవలసి ఉన్నాయి. భూమీ ఆకాశం వాటిలోని సర్వం అనుసరించే మార్గంకాదని, మనిషి దానికి భిన్నమయిన ఓ వింతయిన బాటను నిర్మించుకుంటున్నాడు. తాను ఈ విశ్వవ్యవస్థతో పాటు మరలిపోవలసిన గమ్యం ఏదో విస్మరించాడు. అందువల్లనే అతనికి ఈ వ్యవస్థతో ఘర్షణ తప్పటం లేదు, అశాంతి అలజడులూ తప్పటం లేదు.

*(మే, 1988)*

# 14

**కారు చీకట్లు** గుండెల్ని చీల్చుకుని తూరుపు తెల్లారుతుండగా తొలి పొడుపులోని నెత్తుటి మడుగులో నిండా మునిగి వెలికివచ్చే సూరీడు చెప్పేదేమిటి? ఆ వేళ, నల్లటి ముసుగుల్లోనుంచి పెల్లుబికి వచ్చే ఎర్రటి చాయల దొంతరలు, తెల్లటి వెలుగు చారల తీగెలు చాటేదేమిటి?

రాతిరి తొలి పరదాపై ఓ మెరుపు మెరిసి, కత్తిరించిన బంగారుగోరు లాంటి నెలవంక చిరునగవులు చిందిస్తూ కనుమరుగయే ముందు పోతూ పోతూ పలికేదేమిటి? ఒక్కొక్క రోజే పైకెగబ్రాకుతూ, లావెక్కుతూ, వెలుగొందుతూ, చల్లని చూపులతో, తెల్లటి నీడలతో ఒడలు పులకించేలా, రేయి పగలయ్యేలా పగలబడి నవ్వే నిండుకుండ లాంటి, బంగరుకొండలాంటి నెలరేడు మాటలాడేదేమిటి? గెలిచిన గొప్పతనం పొంగులా చల్లారిపోగా చీకటి చేతుల్లో మెలిమెల్లిగా కరిగిపోతూ, లొంగిపోతూ నిండుగా ఓడిపొయ్యే అమాస చందురుడు వలవలా ఏడుస్తూ వేడుకునేదేమిటి?

ఒకటికి రెండయి, రెంటికి మూడయి పెరుగుతూపొయ్యే రోజులూ, తారీఖులు, ఎప్పటికప్పుడు కొత్తకొత్తగా రూపొందే కడలి కెరటాల్లాంటి మార్పులను తీసుకువచ్చే ఈ రోజులు చెప్పే గొప్పలేమిటి?

అలసిసొలసిన మేనుకు, మెదడుకు, ఎదకు, ఎట్టకేలకు నెమ్మదినిచ్చి రేయంతా రాజ్యమేలి, తెల్లవారున వీడ్కోలు పలికే రాతిరి ఇచ్చే పిలుపు ఏమిటి?--- ఇవన్నీ-

ఈ విశ్వ వ్యవస్థపై నిరంతరం నిఘావేసి ఉంచి ఒక్క క్షణం కూడా తన పట్టును సడలించకుండా ఎంతో క్రమబద్ధంగా, నియమబద్ధంగా పరిపాలించే పరమ ప్రభువు హస్తగతమై ఉన్నాయని, ఆయన అధీనంలో నుండి ఒక్క

క్షణం కూడా తప్పుకోలేవని, ఈ విశ్వ కార్యకలాపాలన్నీ ఓ పథకం ప్రకారం కొనసాగుతున్నాయని ద్యోతకమవడం లేదా?--- అలా కాకపోతే,

- నడిరేయి జామున ఏకాఏకీగా సూరీడు నడినెత్తిన వచ్చి నిల్చుంటే,
- నిన్నటి నెలవంక నేటి పున్నమి చందురుడయి కూర్చుంటే,
- మొన్ననంగా వచ్చిన రాత్రి ఎంతసేపటికీ పోనని మారాము చేస్తూ మొండిగా తిష్ఠవేస్తే,
- రోజులూ తారీఖుల ఈ మార్పులు సంభవించకపోతే,

ఈ జీవన రంగం ఎలా రూపొంది ఉండేది? ఆలోచిస్తేనే ఒళ్ళు జలదరిస్తోంది!

ఇంత క్రమబద్ధంగా, నిర్దిష్ట పథకం ప్రకారం, పకడ్బందీగా విశ్వ వ్యవస్థను నిర్వహించే స్వామి, మనిషికి బుద్ధి వివేకాలు, స్వేచ్ఛాధికారాలు ప్రసాదించిన ప్రభువు లోకంలో మనిషిని ఇష్టారాజ్యం సాగించడానికి వదలివేస్తాడా? అతన్ని, తాను అనుగ్రహించిన వరాలను గురించి ప్రశ్నించడా? విశ్వం మొత్తం విషయంలో అత్యంత హేతుబద్ధత కనబరచిన స్వామి, మనిషి విషయంలో అత్యంత నిర్హేతుకంగా వ్యవహరిస్తాడా? కాదంటుంది కుర్‌ఆన్.

***తరువాత ఆ మహాప్రళయం సంభవించినప్పుడు, ఆనాడు మానవుడు తాను పాటుపడిన విషయాలన్నీ గుర్తుచేసుకుంటాడు. (79 : 34,35)***

ఆ మహోపద్రవం సంభవించిననాడు మనిషి తాను చేసుకున్నదంతా జ్ఞాపకం చేసుకుంటాడు. లెక్క జూపవలసిన ఘడియ ఆసన్నమయినప్పుడు చేసుకున్న కర్మలన్నీ గుర్తుకువచ్చినా ప్రయోజనం?

*(జూన్, 1988)*

# 15

మనసున్న పేరాశల నిలయం, అత్యాశల ఆలయం. అదో అఖాతం, ఎంత పోసినా నిండదు. ఎంత దొరికినా తృప్తిచెందదు. కొంత కష్టపడి కొండంత లబ్ది పొందాలని తహతహలాడుతుంది. ఏ మాత్రం శ్రమ లేకుండానే అన్నీ దక్కాలని కూడా అర్రులుచాస్తుంది తరచుగా.

ఏవీ ప్రాప్తం కాకపోయినా కనీసం పేరూ ప్రతిష్ఠలయినా తన సొంతమవ్వాలని ఉవ్విళ్ళూరుతాడు మనిషి. అందరిలోనూ నిద్రాణమయి ఉంటుందేమో ఆ కోరిక. దాన్ని అణచివేసి హృదయ బహిష్కరణ చేసేవారు కొందరయితే జోకొట్టి నిద్రపుచ్చడానికి, దాన్ని ఎలాగో పోషిస్తూ ఉండడానికి యత్నించే వారు అనేక మంది. చేసిన శ్రమకు తగ్గ ఫలం చేజిక్కాలని కోరుకున్నా అది కొంతలో కొంత నయమే. కాని తాను చెయ్యని పనికీ, తాను చేయని శ్రమకూ తాను చిందించని చెమటకూ ప్రశంసల ప్రతిఫలం కావాలంటాడు మానవుడు. ఎంత దురాశ!

ప్రాపంచికులకు అది సహజమేనేమో! కాని ఆధ్యాత్మిక రంగాన కూడా పేరాశ, అత్యాశలు చోటు చేసుకుంటాయప్పుడప్పుడు. అది ఆధ్యాత్మిక జీవితానికి ఆత్మహత్యా సదృశం. ముఖ్యంగా బాటసారులకు కాక దారిజూపే స్థానంలో ఉన్న పెద్దలకు అవి సోకితే తాము మునగడమేకాక తమ తోటివారినీ తోడుగా తీసుకుని మరీ పోతారు అథఃపాతాళానికి!

పతనావస్థకు చేరుకున్న ప్రతి దైవ ధర్మానుయాయికీ ఈ బాధ తప్పలేదు. యూదులు ఈ రోగాన పడి నిండా మునిగి ఉన్నప్పుడే హజ్రత్ ఈసా వచ్చారు. ప్రదర్శనా బుద్ధిని మానుకొమ్మని ఉపదేశించారు.

తమ ప్రదర్శనల్ని చూసి ప్రజలు తమను- నిష్ఠాపరాయణత్వంలో మునిగి

తేలుతున్నవారుగా, ధర్మానుసరణలో, భక్తిప్రపత్తులలో సాటిలేని వారుగా, పవిత్రులుగా, పరిశుద్ధులుగా, నిస్వార్థ ధర్మ సేవకమన్యులుగా, సంస్కారం తమ ఇంటి బానిసగ, సభ్యత తమ చరణదాసిగా వేనోళ్ళ కొనియాడాలని పరితపిస్తారు కొందరు దైవ భక్తులు!

నలుగురి నోటా నానాలని, తమ త్యాగశీలత గానాలు గానాలుగా నాలుగు చెరగులా వ్యాపించాలని, తమ నీతినిజాయితీ, నాయకత్వపు తప్పెట ఎటు విన్నా వినిపించాలని, తమ చిత్తశుద్ధి సేవాతత్పరత అంతటా కీర్తించబడాలని, ఎన్నెన్నో పిల్లిమొగ్గలు వేస్తారు మరికొందరు!!

కాని హృదయాల లోతుల్లో దాగి ఉన్న కల్మషాన్ని గుర్తించగలిగే ఏకైక స్వామి ఇలా అంటున్నాడు:

**తాము చేసిన చేష్టల పట్ల సంతసిల్లుతూ తాము వాస్తవంగా చెయ్యని కార్యాలకుగాను ప్రశంసలు పొందాలని కోరుకునేవారు శిక్షనుండి తప్పించుకుంటారని నీవు తలపోయకు, నిజానికి వ్యథాభరితమయిన శిక్ష వారికై సిద్ధమయి ఉంది. *(3 : 188)***

తమ నిర్వాకం పట్ల సంబరపడుతూ వాస్తవంగా తాము చెయ్యని పనులకు ప్రశంసలు దక్కాలని కోరుకునే వారు బాధను తప్పించుకుంటారనుకోవద్దని, నిజానికి వారికోసం దుఃఖమయమయిన శిక్ష నిరీక్షిస్తూ ఉందని చెప్పిన ఈ మాటలు యూదులకు సంబంధించినవే కాని ఇందులో మన రూపం కూడా కానరావడంలేదా?

*(జూలై, 1988)*

# 16

**జీవితం – అదో** విచిత్ర దర్శిని. దానికి ఎన్నెన్ని రంగులో, మరెన్ని హంగులో! అనుక్షణం కొత్త రూపు ధరించే పొంగులు!! అందులోనే అందముంది. ఆనందమూ ఉంది.

జగత్తులోని జీవకళకు కేంద్ర బిందువు మానవుడు. అయితే ఈ మనిషి ప్రతి చోటా, ప్రతి వేళా ఒక్కేలా ఉండడు. క్షణం క్షణం మారే రూపుతో ప్రత్యక్ష మవుతాడు. అడుగడుగున మారే రంగుతో దర్శనమిస్తాడు. పొడుగ్గా, పొట్టిగా, నల్లగా, తెల్లగా, బక్కగా, బొద్దుగా - రకరకాలుగా అగుపిస్తాడు. అందమయినవాడితో పాటు కురూపి అయినవాడూ, శక్తిమంతుని ప్రక్కన బలహీనుడు, బుద్ధి జీవి ఒకడయితే బుద్ధిహీనుడు మరొకడు, అంగ సౌష్టవం గల వ్యక్తి చేరువలోనే వికలాంగుడూ, ధనవంతుని నీడన దరిద్రుడు, నిరుపేదవాని ఇంట సంతృప్త మనస్కుడు- ఇలా భిన్నత్వంతో, వైవిధ్యంతో అలరారుతుంది మానవుని మనుగడ.

ఈ భిన్నత్వంతోనే భూలోకం సర్వ శోభాయమానంగా విరాజిల్లు తోంది. శక్తిసామర్థ్యాల, కలిమిలేముల ఈ విభజన, ఈ కలయికలో ఎంతో వివేచన, మరెంతో విజ్ఞత నిబిడీకృతమయి ఉంది. ఈ భిన్నత్వాన్ని, ఈ వ్యత్యాసాలను మనిషి మరింత పెంచితే ముప్పుమూడుతుంది. ఈ వైవిధ్యాన్ని రూపుమాపాలని, అందరినీ కృత్రిమంగా సమానం చెయ్యాలని యత్నించినా ఉపద్రవం ఆసన్నమవుతుంది. ఏది చేసినా ప్రకృతిని ధిక్కరించి సాగించే పోరాటమే అది!

ఈ భిన్నత్వాన్ని మనసారా అంగీకరించని మనసు పరిపరివిధాల పరితపిస్తుంది, ఈర్ష్యాద్వేషాలకు లోనవుతుంది; వైషమ్యం వైమనస్యాలకు గురవుతుంది;

ఘర్షణ నిరోధనలకు, సంఘర్షణాజ్వాలలకు ఆహుతి అవుతుంది. ఫలితం-అరాచకం!

తనకు సక్రమంగా ప్రాప్తంకాని ప్రాపకాన్ని అక్రమంగా ఆక్రమించుకోవడానికి ఉపక్రమిస్తాడు మనిషి. ఇతరులకు లభించిందే తనకూ లభ్యం కావాలని అర్రులు చాచడంకన్నా తనకు యోగ్యమయినదీ, ఉపయోగపడేది మాత్రమే తన అందుబాటులోకి రావాలని కాంక్షించడం, దానికోసం కృషి చెయ్యడం సమంజమయిన మార్గం. అదే ప్రసాదిస్తానని దేవుడూ వాగ్దానం చేస్తున్నాడుః

***మరి అల్లాహ్ మీలో ఎవరికయినా, ఇతరులకన్నా అధికంగా అనుగ్రహించి ఉన్నట్లయితే దాన్ని ఆశించకండి. పురుషులు సంపాయించుకున్న దాని ప్రకారం వారి వాటా లభిస్తుంది, స్త్రీలు సంపాయించుకున్న దాని ప్రకారం వారి వాటా ఉంటుంది. ఇంతకు అల్లాహ్ అనుగ్రహాన్ని సదా అర్థిస్తూ ఉండండి. నిస్సందేహంగా అల్లాహ్ సర్వం తెలిసినవాడు. (4 : 32)***

దైవం ఇతరులకు అనుగ్రహించిన ప్రత్యేకతే తనకూ కావాలని మనిషి పేరాశకు లోనవకుండా ఉన్నట్లయితే ఎవరి కష్టార్జితం వారికి ప్రసాదించడంలో పరమ ప్రభువు అన్యాయం చెయ్యడు. స్త్రీలకయినా, పురుషులకైనా వారి వారి వాటా ప్రకారం లభించవలసింది తప్పక లభిస్తుంది. నిజమే ఆ ప్రభువు సమక్షంలో ఆయన అనుగ్రహం కోసం అర్థిస్తే అది అర్హత, యోగ్యతల ప్రకారం అందుతుందనడంలో సందేహమే లేదు. మనిషిని గురించి ఆయనకు కాకపోతే మరెవరికి తెలుస్తుంది?

(ఆగష్టు, *1988*)

# 17

సమాజంలో దాని సభ్యుల మధ్య అనేక సంబంధాలు. రక్తబాంధవ్యాలు, బంధుత్వాలు, స్నేహాలు. వాటికనుగుణంగా అనేక హక్కులు, బాధ్యతలు. ఏ స్థాయిలో ఏ మాత్రం హెచ్చుతగ్గులు జరిగినా అవ్యవస్థ రూపుదాల్చుతుంది. అందువల్ల అందరి మధ్య సంతులనాన్ని స్థాపించే నియమాలు కావలసి ఉంటాయి. ఆ నియమాల ఉల్లంఘనలే అత్యాచారాలు, అన్యాయాలు, దౌర్జన్యాలుగా పరిణమిస్తాయి.

ఈ అన్యాయాలు, అత్యాచారాలు ఎందుకు చేస్తాడు మనిషి? సౌభాగ్య దౌర్భాగ్యాలకు తానే విధాత అనుకుంటాడు కాబట్టి! తాను ఒకరికి నీడ ఇవ్వనిదే, అండగా నిలవనిదే వారికి దిక్కూ-దివాణం వుండదని భ్రమపడతాడు గనక!

దైవ సందేశం సదా మానవులకు భయభక్తులతో మెలగమని, అందరి పట్ల ప్రేమానురాగాలతో మసలమనే ఉపదేశించింది. ఆ ఉపదేశాలను పాటిస్తే మనిషికే మేలు కలుగుతుంది. వాటిని పాటించక పోతే నష్టపోయేది మనిషే కాని దైవం కాదు.

మనిషి ప్రపంచంలో విచ్చలవిడిగా, అక్రమంగా వ్యవహరించడానికి మరో కారణం తనకు కలగబోయే మేలును కీడును అర్థం చేసుకోకపోవడమే.

గత ప్రవక్తల అనుయాయులు, లోగడ దైవం పంపిన సందేశాలను పెడచెవిన పెట్టినవారు, వాటిలో ప్రక్షిప్తాలు చేసినవారు, వాటిని తమ ఇష్టంవచ్చినట్లు మార్పులూ చేర్పులకు గురిచేసినవారు తమ ఇహపరాలనే అన్యాయం చేసుకున్నారు వినా ఇతరత్రా ఎవరికీ కలిగిన నష్టం ఏమీ లేదు.

ఏ వర్గమయినా దైవాదేశాల పట్ల వైముఖ్యం ప్రదర్శిస్తే ఆ వర్గంవారే నష్టపోతారు. ఏదైనా వర్గంముందుకు వచ్చి దైవ సందేశాన్ని చేతబూనితే దైవం అందజేసే సకల వరాలకు అదివారసత్వం పొందుతుంది.

నిజానికి దైవ సన్నిధిలోనయితే ఇహలోక తాత్కాలిక సాఫల్యమూ ఉంది, పరలోక శాశ్వత విజయమూ ఉంది. అయితే ఏది ఇచ్చినా కోరేవారి సంకల్పం, దీక్షాదక్షతల ఆధారంగా ప్రసాదిస్తాడు. సర్వం కావాలని తాపత్రయపడి పాట్లుపడే వారికి అన్నీ ఇక్కడే అనుగ్రహిస్తాడు. అక్కడ వారికి ఏమీ మిగలదు. అది మాత్రం తథ్యం:

***అవును, అల్లాహ్‌యే స్వామి – నింగిలోనూ నేలపైనా ఉన్న వాటన్నింటికీ. పనులు చక్కబెట్టడానికి ఆయనే చాలు. ఆయన తలచినట్లయితే మిమ్మల్ని తప్పించి మీ స్థానే ఇతరుల్ని తీసుకువస్తాడు. దీనికిగాను ఆయనకు పూర్తి సామర్థ్యం ఉంది. ప్రాపంచిక ప్రతిఫలాపేక్ష కల వ్యక్తి తెలుసుకోవాలి : దైవం వద్ద ప్రపంచ ప్రతిఫలమూ ఉంది, పరలోక ప్రతి ఫలమూ ఉంది. అల్లాహ్ అంతా వింటున్నాడు, చూస్తున్నాడు.***

***(4 :132–134)***

సందేహం లేదు. ఆయన అన్నీ వింటున్నాడు. సర్వం చూస్తున్నాడు. ఏది ఎవరికి ఇచ్చినా, ఏది ఇవ్వకపోయినా అంతా తన తెలివిడి ఆధారంగానే చేస్తాడు. ఎవరి కోరిక, కృషి ఏ మార్గంలో సాగుతోందో ఆయనకు బాగా తెలుసు.

*(సెప్టెంబర్, 1988)*

# 18

**అనంత కాలం** నుండి నిరంతరంగా సాగుతున్న కాలవాహినిలో, మానవాళి మార్గదర్శకత్వం కోసం అరుదెంచిన సందేశహరులు- దైవ సందేశహరులు- అనేక మంది జీవనచరిత్ర కాలప్రవాహంలోనే కొట్టుకు పోయింది. మానవాళికి తెలిసిన చరిత్ర ఏ కొద్ది ఉన్నా అది కాస్తా కష్టాలతో కడగండ్లతోనే కళకళలాడుతోంది.

ప్రవక్తలూ మానవమాత్రులేగనక అప్పుడప్పుడు ఎదురయ్యే కష్టభూయిష్టమైన క్షణాలు వారికి బాధ కలిగిస్తాయి. ఆవేదన రేపుతాయి. మనస్తాపాన్ని రగిలిస్తాయి. ప్రవక్తకు బాధ్యతలు అప్పజెప్పిన ప్రభువు వారికి ఉపశమన వాక్కులు పలికి, వారి బాధ్యతలు గుర్తు చేసి తాను వారి వెనక ఉన్న సత్యాన్ని జ్ఞాపకం చేస్తాడు.

ప్రవక్తలు ప్రపంచంలో నిర్వహించవలసిన బాధ్యతలు రకరకాలు. వారు తమ నోటితో దైవ సందేశాన్ని వినిపించాలి. దాన్ని విశదపరచాలి, దాన్ని వివరించాలి. అది వినేవారి బుద్ధికందేలా, వినీ మిన్నకుండేవారికి మింగుడు పడేలా, అనుసరించదలిచేవారికి మనోగత మయ్యేలా చెప్పాలి. అంతేకాదు- ఆచరించదలిచేవారి కొరకు, ఆ బోధలను ఆచరించిచూపడం కూడా ప్రవక్త బాధ్యతే. తాను మంచిదని బోధించిన విషయం స్వయంగా తన జీవితాన సర్వశోభాయమానంగా అలరారాలి. తాను చెడు అని చెప్పిన దాన్ని తాను స్వయంగా అందరికంటే ముందు విడనాడి ఆదర్శం నిలపాలి.

ఇవి ప్రపంచ బాధ్యతలయితే, పరలోకంలోనూ- పరమ ప్రభువు పరమోన్నత న్యాయస్థానం నెలకొలిపిన నాడు, తాను తన మాటల ద్వారా, చేతల ద్వారా సత్యాన్ని, మచ్చలేని సూర్యకాంతిలా అందరికీ అందజేసినట్టు రుజువు చెయ్యగలగాలి.

అప్పటికి గాని నెరవేరదు ప్రవక్త బాధ్యత!

ఆ బాధ్యత అంతిమ దైవ సందేశహరుడు, చివరి ప్రవక్త హజ్రత్ - (సఅసం)పై కూడా పడింది. ఆ బాధ్యత ఆయన సహచరులయిన స... ద్వారా నేటివరకు నిరంతరాయంగా, సతతం బదిలీ అవుతూ నేడు ఆయన పేరు చెప్పుకుని, ఆయన్నే నమ్మి, ఆయన జీవితాన్నే తమ ఆదర్శంగా చేసుకుని జీవిస్తున్న, ముస్లిములనబడే ప్రజలపైన వ్యక్తిగతంగానూ, సామూహికంగానూ తారసిల్లుతుంది.

ఆయన పుట్టిననాటి పండుగ ప్రతి సంవత్సరం చేసుకునే ముస్లిమ్ సమాజం ఆత్మపరిశీలన చేసుకోవలసిన తరుణమిది. ఆయన నెలకొలిపిన సంప్రదాయాలను తమ జీవనసరళిగా చేసుకోవాలని ఉవ్విళ్ళూరే ప్రజలు లోతుగా ఆలోచించవలసిన గడియలివి. ఆ బాధ్యతను, ఆయన మానసిక స్థితిని, ఆయన అనుయాయుల కర్తవ్యాన్ని ఇలా విశదీకరిస్తుంది దివ్య ఖుర్‌ఆన్:

**ప్రవక్తా, మేము నిన్ను సాక్ష్యమిచ్చేవానిగా, శుభవార్తనిచ్చే వానిగా, హెచ్చరించే వానిగా, అల్లాహ్ అనుజ్ఞతో ఆయన వైపునకు పిలుపునిచ్చేవానిగా, ప్రకాశమానమయిన దీపంగా చేసి పంపాము. (నిన్ను) విశ్వసించే వారికి శుభవార్త నివ్వు, వారికి అల్లాహ్ తరఫున మహానుగ్రహం లభించనున్నదని.** ***(33 : 45–47)***

దైవ ప్రవక్త మహనీయ ముహమ్మద్ (సఅసం)ను 'సాక్షి'గాను, 'శుభవార్త' నిచ్చేవానిగాను, 'హెచ్చరిక' చేసేవానిగాను నియమించడమే కాక దైవం వైపునకు 'పిలుపు' నిచ్చే, మార్గం చూపే కాంతిమంతమయిన దీపంగాకూడా పేర్కొన్నాడు విశ్వప్రభువు. ఇలాంటి ప్రవక్తను నమ్మి ఆయన్ని అనుసరించే అనుయాయి జనులకు దైవానుగ్రహం లభించడంలో సందేహమేముంది?

*(అక్టోబర్, 1988)*

# 19

**జీవితం ఓ** మహత్తరమయిన సాధన. ఇందులో కృషికి తగ్గ ఫలం, ఫలానికి తగ్గ సుఖం సంప్రాప్తమవుతుంది. అయితే జీవితాన్ని ఎలా గడపాలి?

మనసులోని కోరికల గుర్రాలు ఎటుబడితే అటు లాక్కువెళతామంటాయి; జీవితం మళ్ళీ మళ్ళీ దొరికే యోగం కాదంటాయి; దొరికింది దొరికినట్టే, అందింది అందినట్టే కాజేయమంటాయి; మజాలు వీలయినంతమేరకు జుర్రుకోమంటాయి; సుఖాలు సాధ్యమయినంతవరకు ఆస్వాదించ మంటాయి; కొత్త కొత్త రుచులు చూడమంటాయి; జీవితాన్ని సంపూర్ణంగా అనుభవించమంటాయి.

వంశంలోని ఆచారవ్యవహారాలు, పెద్దలు నెలకొల్పిన సంప్రదాయాలు, కుటుంబంలోని నియమాలు మరో వైపునకు లాగుతాయి. ఆచారాలను కళ్ళు మూసుకుని పాటించమంటాయి; మూఢ విశ్వాసాలను గుడ్డిగా నమ్మమంటాయి; కుటుంబ నియమాలు పాటించకపోతే ముక్కు ఊడి పోతుందంటాయి; పరువు మంటగలుస్తుందంటాయి; ఆచార వ్యవహారాలను, సంప్రదాయాలను ఎదురుతిరిగి ప్రశ్నించరాదంటాయి.

మరో ప్రక్కన సమకాలీన శాసనాలు, చట్టాలు, ప్రభుత్వాలు తమ అడుగులకు మడుగులొత్తమంటుంటాయి. కానీ మనిషి వీటినన్నింటినీ పాటించగలడా? వీటిలో దేన్ని పాటించినా అతని జీవితం సుఖమయం అవుతుందన్న హామీ ఎక్కడిది? అందువల్ల పుట్టించి పోషిస్తున్న నిజ ప్రభువును, ఆయన ఆదేశాలను పాటించడంలోనే మనిషి ఇహపరాల సౌఖ్యం ఇమిడి ఉంది.

ముఖ్యంగా దైవాన్ని విశ్వసించి, ఆయన అందజేసిన మార్గదర్శకత్వాన్నే పాటించి బ్రతకాలని కోరుకునేవారు ఎలా నడుచుకోవాలో దైవ గ్రంథం స్పష్టంగా సూచించింది:

**విశ్వసించిన వారలారా, అల్లాహ్‌కు విధేయులవ్వండి, ప్రవక్తను, మీలో బాధ్యులయిన (అధికారంగల) వారిని అనుసరించండి. ఆపైన ఏదయినా వివాదం మీలో తలెత్తినట్లయితే దాన్ని అల్లాహ్, ఆయన ప్రవక్తల వైపునకు మరలించండి - మీరు నిజంగానే అల్లాహ్‌నూ, అంతిమ దినాన్నీ విశ్వసించేవారయితే. ఇదే సరయిన విధానం, ఫల స్వరూపంగా మేలయినది కూడా. *(4 : 59)***

మీరు నిజంగానే విశ్వసించినవారయితే మీ వ్యవహారాల్లో దైవ ఆదేశాలను అనుసరించాలని, దైవ ప్రవక్త నిర్దేశాలను పాటించాలని, ఈ రెంటి అనుసరణకు లోబడి మీలో నాయకత్వపు బాధ్యతలు తీసుకున్న వారిని అనుసరించాలని ఈ దైవాదేశంలోని సారాంశం. మనలో ఎందరి జీవితాలు దీనికనుగుణంగా ఉన్నాయి?!

*(నవంబర్, 1988)*

# 20

**ఏది న్యాయం,** ఏది అన్యాయం? ఏది ద్వేషం, ఏది అభిమానం? ఏది ప్రేమ, ఏది వైరం?

ఏది ధర్మం, ఏదధర్మం? ఏది సత్యం, ఏదసత్యం?

మనిషి ఆలోచనావరణ బహు స్వల్పం. ఎంత పరుగెత్తినా ఓ చోట నిలిచి పోతుంది. ఎంత పయనించినా ఓనాడు అలసిపోతుంది. ఎంత పైకెగిరినా ఓ ఎత్తున పడిపోతుంది. ఎంత ఎదిగినా ఓ తాన ఆగిపోతుంది. అందువల్లనే మానవ సామాజిక జీవనానికి మూలావసరాలయిన పై ప్రశ్నలకు మనిషి ఒక్క సమాధానం ఇవ్వలేకపొయ్యాడు. ఒక్కోదానికి ఒక్కో విధంగా బదులు చెప్పుకుని సమాధానపడ్డాడు మనిషి.

తనవారు, పరాయివారు; తన జాతి, పరాయి జాతి; తన దేశం, పరాయి దేశం- ఇలా మానవుల మధ్య మానవుల ప్రయోజనాల మధ్య, మానవులకు కలిగే మేలూ కీడుల మధ్య లంకెలు కుదిర్చి న్యాయాన్యాయాలకు, ద్వేషం అభిమానాలకు కొలబద్దలు నిర్మించుకున్నాడు. ఆ కొలబద్దలు అతన్ని ఓ చోట నిలువనివ్వలేదు.

ఫలితంగా మనిషి మనిషికి మధ్య వైషమ్యాలు, వైరాలు పెరిగాయి. ఎవరు, ఎవరిని, ఎలా, ఎప్పుడు దోచుకోవాలో పన్నాగాలు పన్నసాగాడు మనిషనే ఈ జీవి! నేడు మనిషిని మనిషి పీక్కుతినేందుకు తయారవడానికి కారణం పై ప్రశ్నలకు మానవుడు తాను సృష్టించుకున్న కొలబద్దలే అని కాస్త ఆలోచిస్తే తేలిపోతుంది.

తన జ్ఞాన పరిధికి అందని అనేక ప్రశ్నలకు మాదిరిగానే ఈ ప్రశ్నలకు

సయితం తనకు అతీతమయిన శక్తి ద్వారా లభించే మార్గదర్శకత్వమే మనిషికి శరణ్యం.

అవే సహేతుకమయిన, సమంజసమైన, సకల మానవులను సమ దృష్టితో చూసే కొలబద్దలు కాగలవు. ఎందుకంటే అవి సమస్త లోకాలకు, సకల జీవరాసులకు, సర్వ మానవులకు సృజన కర్త, పోషకుడు, స్వామి అయిన మహోన్నత ప్రభువు ప్రసాదించిన కొలబద్దలు:

**విశ్వసించినవారలారా, న్యాయాన్ని నిలబెట్టేవారుగాను, దైవం కొరకు సాక్ష్యమిచ్చే వారిగానూ నిలబడండి – మీ న్యాయనిబద్ధత, మీ సాక్ష్యం స్వయంగా మిమ్మల్ని మీ తల్లిదండ్రుల్ని, మీ బంధువుల్ని దెబ్బ తీసినా సరే – విపక్షీయుడు శ్రీమంతుడయినా, నిరుపేద అయినా సరే – అల్లాహ్ మీకన్నా అధికంగానే వారి మేలును కోరేవాడు.** ***(4 : 135)***

దైవాన్ని విశ్వసించేవారు కేవలం న్యాయశీలురుగా కాదు, న్యాయానికి ధ్వజవాహకులుగా రూపొందాలని, కేవలం దైవం కొరకే సాక్షులుగా నిలబడాలని ఈ ఆయత్‌లలో కోరడం జరిగింది. న్యాయశీలత, సరయిన సాక్ష్యం వల్ల స్వయంగా తమకు, తమ బంధు వర్గానికీ నష్టం వాటిల్లినా ఆ వైఖరిని విడనాడరాదని, ఎదుటి వ్యక్తి నిరుపేద అయినా సిరిగలవాడయినా సొంత అభిమానాలను వదలి నిష్పక్షపాతంగా వ్యవహరించాలని బోధించడం జరిగింది. కాని నేడు మన వైఖరి ఎలా ఉంది--?

*(డిసెంబర్, 1988)*

# 21

**జీవితం ఆట** కాదు, నాటకమూ కాదు, తోలు బొమ్మలాట అంత కన్నా కాదు, జీవితం ఓ యదార్థం, కళ్ళకు కట్టినట్టు కానవస్తున్న వాస్తవం, మనిషి అనుక్షణం అనుభవిస్తున్న సత్యం.

అలాంటప్పుడు జీవితాన్ని ప్రశాంత హృదయంతో, స్థిరచిత్తంతో, నిర్దిష్టమయిన దృక్పథాలతో, నిర్దుష్టమయిన ఆలోచనలతో గడపాలి. మన అభిరుచులు, అభిప్రాయాలూ, సరైన గాడిలో పడాలి. భావాలూ, భావనలు సత్యమయిన రీతిలో రూపొందాలి. వైఖరులూ ధోరణులు స్పష్టమయిన మార్గాన నడవాలి. నెయ్యమయినా కయ్యమయినా ప్రమాణాలు స్వచ్ఛంగా ఉండాలి. కార్యకలాపాలు, ప్రయత్నాలు, ఏకోన్ముఖంగా ముందుకు సాగాలి. అదే జీవితం పట్ల చిత్తశుద్ధితో శ్రద్ధ చూపడమంటే అర్థం!

అంతేకాని విశ్వాసాలు ఒక దారినపోతే ప్రవర్తనలు మరో దారిన పోవడం, ఆలోచనలు ఒకదాన్ని ప్రతిఫలిస్తే ఆచరణలు మరోదాన్ని ప్రతిబింబించడం, అభిప్రాయాలు ఓ విధంగా వ్యక్తమవుతే అభిరుచులు మరో రీతిలో వెల్లడి కావడం, మైత్రీ ప్రమాణాలు కొన్నయితే శత్రుత్వపు కొలమానాలు వేరే అవడం, ప్రకటనలు ఓ నీతిని చాటితే కార్యకలాపాలు వేరే విలువల్ని స్పష్టపరచడం – జీవితం పట్ల మనిషి శ్రద్ధాసక్తుల్ని చూపవు. ఇలా మనుగడ సాగించే మనిషి జీవితాన్ని ఆట వస్తువుకన్నా హీనంగా పరిగణిస్తున్నాడన్న మాట.

ఈ భావాన్నే 'ఈమాన్' లేక విశ్వాసం అన్నది చాటుతుంది. మనిషి దేన్నయితే విశ్వసిస్తాడో దాన్ని పరిపూర్ణ హృదయంతో నమ్మాలి. చిత్తశుద్ధితో నమ్మాలి. ఆచరించే బుద్ధితో నమ్మాలి. అదే సరయిన పద్ధతి. తన

ఆలోచనల్ని, అభిరుచుల్ని, ఇష్టాయిష్టాలను, నడవడిని, రాగద్వేషాలను, కర్తృత్వ పరిధిని తాను విశ్వసించే అంశాలకనుగుణంగా మలచుకోవాలి.

తాను నమ్మే వాటిని తిరస్కరించే వారికి దూరమయి, వారినుండి వేరయి, స్వీకరించేవారికి చేరువయి పోవాలి. అలాగే విశ్వసించకపోవడమంటే కేవలం ఒక విషయాన్ని తిరస్కరించడం మటుకే కాదు. నోటితో అంగీకార వచనాలు వల్లించి మనసులో, ఆచరణలోనూ దానికి భిన్నమయిన వైఖరిని అవలంబించినా అది తిరస్కారానికి ప్రతిరూపంగానే గణించబడుతుంది. మనిషి తానెక్కడ ఉన్నాడో పరిశీలించుకోవాలిః

**విశ్వసించిన జనులారా, విశ్వసించండి – అల్లాహ్‌ను, ఆయన సందేశహరుణ్ణి, అల్లాహ్ తన సందేశహరునిపై అవతరింపజేసిన గ్రంథాన్ని, ఆయన ఇతఃపూర్వంకూడా అవతరింపజేసిన ప్రతి గ్రంథాన్ని. అల్లాహ్, ఆయన దూతలు, ఆయన గ్రంథాలు, ఆయన ప్రవక్తలు, పరలోకదినంపట్ల తిరస్కారం కనబరచేవాడు మార్గం తప్పి అపమార్గాన బహుదూరం వెళ్ళిపోయాడు. *(4 : 136)***

'విశ్వసించిన' వారమని చెప్పుకునేవారికి ఈ దైవాదేశం 'విశ్వసించ'మని బోధిస్తోంది! మరి ద్వంద్వ వైఖరి లేని విశ్వాసమంటే అదే. తిరస్కారులు సన్మార్గానికి దూరమవడానికి కారణం వారి పాషాణ హృదయం కాకపోతే మరేమిటి?

*(జనవరి, ఫిబ్రవరి, 1989)*

# 22

విద్యా విజ్ఞాన సంపత్తి, బుద్ధీవివేకాల ఐశ్వర్యం, ధనధాన్యాల సంపద, భోగభాగ్యాల వైభవం, పదవీ అధికారాల దర్పం, విలాసమయ జీవితపు ఠీవి, అందం, శరీర సౌష్ఠవం, బుద్ధి కౌశల్యం, దృష్టి నైశిత్యం- ఇవన్నీ మనిషిలో అహంభావానికి, పిదప అహంకారానికి మార్గం సుగమం చేస్తాయి. వీటిని అదుపులో ఉంచడం, వీటి కారణంగా అదుపుతప్పే అంతర్యాన్ని అడుగు తడబడకుండా కాపాడటం సాధారణంగా అసాధ్యం కాకపోయినా కష్టసాధ్యం అని చెప్పవచ్చు.

మనిషి తనకు ఉన్న విద్యావిజ్ఞానాలను కొంత ప్రదర్శించి కొందరు ప్రశంసించగానే ఉబ్బితబ్బిబ్బయినా ఫరవాలేదు. కాని 'నన్ను దెబ్బతీయడం ఎవడబ్బతరం' అని పొగరుమోతుగా తల ఎగురవేస్తేనే చిక్కు. ఆ స్వయోత్కర్ష స్థితిలో మనిషి ఎదుటివాణ్ణి ఖాతరు చెయ్యడు, తన మొదటివాణ్ణీ లెక్క జెయ్యడు, తన నుదుటి వ్రాతనూ గుర్తుచేసుకోడు. తానే సర్వం, తానే ఆది, తానే అంతం అనుకుంటాడు.

అహంకారం మండే వస్త్రం. అది ధరించినవాణ్ణి కాపాడదు. తానూ మండుతుంది, ధరించినవాణ్ణీ దహించివేస్తుంది. అది మనిషికీ, సత్యానికీ మధ్య అడ్డు తెరగా నిలుస్తుంది, అహంకార జ్వాలలలో రగులుతూ మనిషి తానెన్నో అందాలతో అలరారుతున్నట్లు భ్రమపడినా దానివల్ల అంతరంగం మసిబారి, బాహ్యం వికృతంగా తయారయి అందరికీ దూరమయి, ఎవరికీ చేరువ కాకుండా పోతాడు మనిషి.

అహంకారాగ్నికి మాడే మనిషి తాత్కాలిక ప్రయోజనాలను పొందినా క్రమేణ, నీచత్వం బయటపడగా ఎవరికీ స్వీకారయోగ్యంకాని రూపం

ధరిస్తాడు. సత్యానికి దూరమయిన అతను మరి దేనికీ దగ్గర కాలేడు. సత్యాన్ని తిరస్కరించేవాని స్థితి ఎలా ఉంటుంది? విశ్వ ప్రభువు ఇలాంటి ఓ వ్యక్తిని ప్రస్తావించి ఇలా అంటున్నాడు :

*నన్నూ, నేను ఒంటరివానిగా పుట్టించిన ఆ వ్యక్తినీ విడువండి. నేను అతనికి ఎంతో సంపదనిచ్చాను, సదా తోడుగా ఉండే సంతానాన్ని ఇచ్చాను, అతనికి అధికార మార్గాన్నీ సుగమం చేశాను; అయినా నేను అతనికి ఇంకా అధికంగా ఇవ్వాలని పేరాశ పడుతున్నాడు. ఎంత మాత్రం వీల్లేదు. అతను మా వచనాలపట్ల వైషమ్యం కలవాడు. నేనతనికి అనతి కాలంలోనే ఓ కఠిన ఎత్తునకు ఎక్కిస్తాను. అతను ఆలోచించి మాట మార్చే ప్రయత్నం చేశాడు. దేవుని ఆ ఘాతం అతనిపై- ఎలా మాట మార్చే యత్నం చేశాడు? అవును దేవుని ఆ ఘాతం అతనిపై, ఎలా మాట మార్చే యత్నం చేశాడు? తరువాత (జనం వైపునకు) చూశాడు. భృకుటి ముడివేశాడు, ముఖం చిట్లించాడు, తరువాత మరిలాడు, అహంకారంలో పడిపోయాడు! (74 : 11–23)*

అహంకారమే నైచ్యానికి గురిచేసి, ప్రాప్తమయినదాని పట్ల అసంతుష్టినీ సత్యం పట్ల వైముఖ్యాన్ని జనింపజేస్తుంది. అదే మహా రోగం.

(మార్చి , 1989)

# 23

**దివ్య ఖుర్ఆన్ –** అదే సకల శుభ సంశోభిత సరోవరం, విశ్వప్రభు ప్రసాదిత మహోపదేశ ఉద్గ్రంథం, సత్యాసత్యాల, ధర్మాధర్మాల నికషోపలం– అదే అల్ ఫుర్కాన్ !

మనిషి బాహ్య జగత్తున ఎన్ని ఘనకార్యాల మహా శిఖరాలనధిరోహించినా, అంతర్ముఖుడయి తన అగాధాల్లోకి దిగి ఆంతర్యాన్ని అన్వేషించి, పరిశీలించి, పరిశోధించి, పరిశుద్ధపరచుకోలేడు. బాహ్యంలో ఎన్ని అంబరాలు దాటగలిగినా ఆంతర్యంలో ఒక్క మెట్టు దిగడం కూడా మనిషికి ఇష్టముండదు, ఉన్నా సాధ్యపడదు. విజ్ఞానాన్ని వివేకాలను వినియోగించి తాను నివసించే జగత్తును ఎంతో రమ్యంగా, రమణీయంగా, ఆహ్లాదకరంగా, ఆహార్యంగా తీర్చిదిద్దుకున్నాడు. కాని అంతశ్శోధనకై చేసిన యత్నాలన్నీ మనిషిని తీరానికి చేర్చలేకపొయ్యాయి. అది మనిషి బలహీనత.

మనిషి మానసిక ఆధ్యాత్మిక శిక్షణకు కావలసిన రాచబాటను చూపడం, మనిషి అంతర్ బాహ్యాలనెరిగిన అండపిండ బ్రహ్మాండాల స్రష్ట, విశ్వాన్ని పరిపోషిస్తున్న, పరిపాలిస్తున్న ప్రభువుకే సాధ్యం. అలా చూపడం ఆయనకే సాధ్యమయినప్పుడు, అది ఆయన కర్తవ్యం కూడా అవుతుంది, అందువల్లనే ఆయన దాన్ని నిర్వర్తించాడు కూడా.

మనిషి పుడమిపైన కాలుమోపిన క్షణం నుండే మార్గదర్శకత్వం నెరిపే తన బాధ్యతను నెరవేర్చే ఏర్పాట్లు చేశాడు విశ్వప్రభువు. మనిషిని అజ్ఞానపు చీకట్లల్లో వదలివెయ్యలేదాయన. దేదీప్యమానమయిన దివిటీని వెలిగించి చేతికిచ్చి మరీ పంపాడు భువికి.

వేనవేల సందేశహరుల్ని తన ప్రియాతిప్రియమయిన సృష్టి 'మనిషి' మానసిక, ఆధ్యాత్మిక పరిశుద్ధతల కోసం పవిత్రతల కోసం నియమించాడు విశ్వప్రభువు. అనేక సదుపదేశ సముదాయాలను, ఉద్గ్రంథాలను అందజేశాడు. ఆ గ్రంథాలలో అంతిమ గ్రంథం దివ్య ఖుర్‌ఆన్, అల్ ఫుర్‌కాన్. ఆ మార్గదర్శకావళి అవతరించిన శుభఘడియలే రమజాన్ రేయింబళ్ళు. ఆ దివ్య గ్రంథానికి ప్రతిగా మానవుడు తెలుపుకునే కృతజ్ఞతాభావానికి ప్రతీకలే రమజాన్ నెలలో విశ్వాస జనులు పాటించే ఉపవాసవ్రతాలు.

పవిత్ర గ్రంథం అందజేసే సందేశాన్ని అందరికీ అందుబాటులో ఉండేలా చెయ్యడం, దాని బోధనల్ని మన అంగాంగాలూ అవలంబించేలా చూడటం, దాత ఆ మహా వరాన్ని ప్రసాదించిన ధ్యేయం కోసం అహరహం పరిశ్రమించడం, ఆ కృషికి అవసరమయిన తర్ఫీదు పొందడం ఇదే నిజమయిన కృతజ్ఞతా భావం. ఈ ఉపవాసవ్రతాల (రోజాల) ద్వారా ప్రభువు మన నుండి కోరేదీ అదే.

**అల్లాహ్ మీ పట్ల మెతక వైఖరిని అవలంబించదలిచాడు, కాఠిన్యం వహించ దలచలేదు. ఈ విధానంవల్ల మీరు రోజాల సంఖ్యను పూర్తి చేసుకోగలగాలనీ, అల్లాహ్ మీకు ప్రదానం చేసిన మార్గదర్శకత్వానికిగాను మీరు అల్లాహ్ ఘనతను కొనియాడాలని అంగీకరించాలనీ ఇంకా ఆయనవట్ల కృతజ్ఞులవ్వా లనీను. *(2 : 185)***

రోజా కేవలం ఆరాధన మాత్రమే కాదు. అది మన నైతిక ఆధ్యాత్మిక పరిశుద్ధతకు, శిక్షణకు మార్గం మాత్రమే కాదు. అది మహా వరప్రసాదమయిన దివ్య ఖుర్‌ఆన్ ప్రదానం చేసినందుకు మనం దైవానికి అర్పించుకునే కృతజ్ఞతాభివందనం కూడా!

*(ఏప్రిల్, 1989)*

**ప్రపంచం అసంఖ్యాక** సమస్యల సంత. అగణ్య మార్గాల కూడలి; అనేక లక్ష్యాలకారడవి. ఇక్కడ కళ్ళు చెదిరిపొయ్యే వెలుగులు, గుండెలదిరిపొయ్యే జిలుగులు; మనసు బెదిరిపొయ్యే తళుకులు.

ఈ ఆకర్షణల తోరణంలో మనిషి ఆశలకు వెర్రితలలు, కోరికలకు వెయ్యి గుర్రాలు! మస్తిష్కం తూర్పు అంటే మనస్సు పడమర అంటుంది. అవసరాలు ఒకటంటే, ఆశలు రెండంటాయి; కాంక్షలు లక్షలంటాయి. మనసుకో మార్గం, మనిషికో లక్ష్యం, గంటకో గమ్యం అన్నట్టు సాగుతుంది ఇక్కడ జీవితం.

అందుకే జీవితంలో శాంతి కరవయింది. ఆశలుచేసే పిచ్చి ఘోష, ఆలోచనలు రేపే హోరు గాలి, కోరికలు రగిలించే జ్వాలా శిఖలు మనిషి మనస్సునూ, మస్తిష్కాన్నీ, మనుగడను ఛిన్నాభిన్నం చేసివేస్తున్నాయి. దేనికీ తట్టుకోలేక కళ్ళు మూసుకుని మార్గవిహీనంగా, లక్ష్యరహితంగా, ఆగోచరగమ్యంగా బ్రతుకులో పరుగులు తీస్తున్నాడు మనిషి.

నీతిరాహిత్యం, నీతి బాహ్యత్వం, అన్యాయం, అధర్మం, అసత్యం, అత్యాచారం, దౌర్జన్యం- ఈ విలువలన్నింటిమీద అధికారం చెలాయించే స్వార్థం- అన్నీ కలిసి జీవితంలో అంధకారాన్ని సృష్టిస్తున్నాయి; అశాంతిని నెలకొలుపు తున్నాయి.

ఈ చీకట్లల్లో కొట్టుమిట్టాడే మనిషి కోరికల గుర్రాలకు పగ్గాలు కట్టి వాటిని ఆశల పిశాచాల చేతుల్లో పెట్టాడు. బండి చీకటిలో దూసుకుపోతోంది. ఏ అగాధాల్లో పడుతుందో, ఏ అగ్నిగుండానికి ఆహుతి అవుతుందో ఎవరికి తెలుసు?

స్వయంగా ఎలాంటి వెలుగు కిరణమూ లేని మనిషి ఎంతసేపని ఇలా అంధకారంలో పరుగులు తీయగలడు?? ఎంత కాలమని తన పతనాన్ని ఆపగలడు???

పుట్టించిన స్వామి చూపే మార్గం తప్ప మనిషికి వేరే దారిలేదు. ఆ వెలుగు లోనే అతనికి కరవయిన సుఖం, శాంతి, తృప్తి లభిస్తాయిః

**జనులారా, మీ వద్దకు మీ ప్రభువు వద్దనుండ ప్రకాశమానమయిన నిదర్శనం వచ్చేసింది. మేము మీ వద్దకు అతి స్పష్టంగా దారిచూపే జ్యోతిని పంపాము. ఇక అల్లాహ్ మాటను విని ఆయన శరణుజొచ్చిన వారికి అల్లాహ్ వారిని తన కారుణ్యం, తన అనుగ్రహాల ఛాయలో ఆశ్రయమిస్తాడు. తన వైపునకు వచ్చే రుజు మార్గాన్ని వారికి చూపుతాడు. *(4 : 174,175)***

ప్రస్ఫుటమయిన నిదర్శనాలు, స్పష్టమయిన దారిని చూపే కాంతి, విశ్వప్రభువు అందించగా దాన్ని గ్రహించి అనుసరించినవారికి, ఆయన శరణుజొచ్చినవారికి, ఆయన కారుణ్యం, అనుగ్రహాలు ఆశ్రయమిస్తాయి. ఆయన వద్దకు చేరే రుజు మార్గాన్ని సుగమం చేస్తాయి – కావలసింది గ్రహించగలిగే హృదయమే!

*(జూన్, 1989)*

# 25

వసంతం ఎంతో శోభాయమానమయింది. అందులో మొగ్గలు తొడిగే రెమ్మలు, వికసించే పూలు, సస్యశ్యామల వృక్షాల తోరణాలు, కనుచూపు మేర కానవచ్చే పచ్చదనం ఎంతో మనోహరంగా, మనోజ్ఞంగా, ఆహ్లాదకరంగా, ఆనందదాయకంగా అగుపిస్తాయి. ఇది ఇలాగే కొనసాగితే, సతతం ప్రపంచం వసంతమయమయితే ఎంత బావుండు అనిపిస్తుంది. కాని అది సాధ్యం కాదు. వసంతం మూన్నాళ్ళ ముచ్చటే. గ్రీష్మం వచ్చినా క్షణం ఒక యుగం అన్న అనుభూతికి లోనవుతాడు మనిషి. కాని అదీ ఎంతో కాలం నిలువదు. ముందుకు సాగిపోతుంది.

ఈ లోక ఫలకంపైన కాలం ఎన్ని ముద్రలు వేసినా అవన్నీ తాత్కాలిక మయినవే. ఒక్కటీ స్థిరమయింది కాదు. చిరమయిందీ కాదు. ఇక్కడ మనస్సును మభ్యపెట్టే సరకు లెక్కలేనంతగా ఉంది. కానీ వాస్తవానికి అది బహు స్వల్పం, అత్యల్పం, ఎంతో హేయమయింది. మనిషి తన హ్రస్వ దృష్టి కారణంగా దానికి ఎనలేని విలువను అంటగడతాడు. తన ఈ తప్పుడు భావనా శకటంలో పయనించి వాటిని సాధించడమే మహా గొప్ప వరంగా భ్రమపడతాడు. నిజానికి ఇక్కడ ప్రాప్తమయ్యే ఎన్ని రుచులయినా, ఎన్ని మాధుర్యాలయినా అవన్నీ ఈ ఆరడుగుల అద్దె కొంపలో ఉన్నంత కాలం, ఆయన వద్ద అరువుదెచ్చుకున్న జీవన వ్యవధి ముగియనంత వరకు మాత్రమే కదా. ఆ వ్యవధిలోనూ ఎన్ని మలుపులు, ఎన్ని డొంకలు, ఎన్నెన్ని బండరాళ్ళు!

మనిషికి ఈ పరమ సత్యం తెలీదని కాదు. పుడమిలో ఊపిరి పీల్చడం నేర్చుకున్న ప్రతి మనిషి మేనులోని మెదడు స్వయంగా అనుభం గడించాలని కోరుకుంటుంది. తమకు పూర్వం భూమిపైన కాలుమోపినవారి అనుభవాల

నుండి గుణపాఠం గడించాలన్న విశాల హృదయం భ్రమలమయమయిన ఈ లోకం చేసే మోసంలో పడిపోదు. దీని భ్రమలలో మునిగితే సర్వదా నష్టమే అని తలపోస్తుంది సచేతనమయిన మేధ. దీనికి బదులుగా శాశ్వత ప్రాతిపదికల కొత్త లోకాల అన్వేషణలో తన జీవితాన్ని సార్థకం చేసుకోవాలన్న తపనతో అవిశ్రాంతంగా కృషి సలుపుతుంది. సాఫల్య మార్గాన పయనిస్తుంది. అలాంటి చైతన్యవంతమైన మనస్సులపైనే విశ్వప్రభువు తన అనుగ్రహాల జల్లు కురిపిస్తాడు.

**ప్రపంచ జీవితం మోసపుచ్చే సామగ్రి తప్ప మరేమీ కాదు. పరుగిడండి, ఒకరినొకరు మించి పోవడానికి యత్నించండి – మీ ప్రభువు క్షమా భిక్షవైపునకు, గగన భువనాలవంటి సువిశాల స్వర్గం వైపునకు. అది అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తల్నీ విశ్వసించిన వారి కొరకు పొందుపరచబడింది. ఇది దైవానుగ్రహం, దాన్ని తాను కోరిన వారికి ఆయన ప్రసాదిస్తాడు. అల్లాహ్ మహానుగ్రహాలవాడు.** ***(57 : 20, 21)***

దైవాన్నీ, దైవ సందేశహరుల్ని విశ్వసించడం ద్వారా ప్రాప్తమయ్యే శాంతి, తృప్తి, ఐహిక వస్తుసామగ్రి మధ్యవుంటూ వాటి వ్యామోహానికి గురికాకుండా నిగ్రహాన్నిచ్చే విరక్తి అన్యమనస్కమయిన హృదయానికి లభించవన్నది యదార్థం.

*(జులై, 1989)*

# 26

**ఉనికికి ఓ** ఉద్దేశ్యమంటూ లేకపోతే మానవ జీవితం నిరర్థకం, నిష్ప్రయోజనం, ఉద్దేశ్యరహితంగా జీవించే క్రిమికీటకాలతో సమానం. అందుకే మనిషి ఆశయ శూన్యంగా, మార్గవిహీనంగా జీవించడానికి ఇష్టపడడు. జీవితానికి ఓ ధ్యేయమంటూ నిర్ణయించుకుని జీవించాలని కోరుకుంటాడు. తదనుగుణంగా జీవితాన్ని మలచుకుంటాడు, ఆ బాటనే నడుచుకుంటూ పోతాడు.

మనిషి గమ్యానికనుగుణంగా గుణగణాలు అలవడుతాయి. ప్రవర్తన తీరు రూపుదిద్దుకుంటుంది. సహవాసకూటమి ఏర్పడుతుంది. ఒకే ధ్యేయం, ఒకే మార్గం, ఒకే తీరు కోరుకున్న వారంతా చేరువవుతారు, ఒకటవుతారు. అదో సంఘం- మానవ సంఘంలో ఉప సంఘం. వేర్వేరు ఆశయాలవారు వేర్వేరు సంఘాలు, ఉపసంఘాలుగా ఆవిర్భవిస్తారు.

ముస్లిమ్‌లు ఓ ప్రత్యేక అనుచర సంఘం-ప్రవక్త అనుచర సంఘం. దాని ఆశయం వేరు, ఆదర్శం వేరు, మార్గం వేరు, గమనం వేరు. ఆ సంఘానికి ఓ రూపు, దానిదో ప్రవర్తనాసరళి, దానికో నియమావళి. భువిలో దివి తేజాన్ని విస్తరింపజెయ్యడం, విశ్వప్రభువు ఆదేశాల కనుగుణంగా ఓ సమాజాన్ని- మంచిని పెంచి చెడును త్రుంచే సమాజాన్ని- నెలకొలపడం దాని ఆశయం. ఈ ఆశయం ఆధారంగానే అది ఒకటయినా, వేరయినా మరో లక్ష్యంతో చేరువవడమయినా, వేరుపడటమయినా వారికి తగదు. ఎందుకంటే వారి ఉనికికి అర్థమేమిటో వారి ప్రభువే నిర్ణయించాడు, ఆయనే దాన్ని సాధించే మార్గాన్నీ సూచించాడు.

ఆ మార్గంలో మొదటి మెట్టు, సకల సాత్వికతలకు, సర్వ సద్గుణాలకు,

సమస్త శుభాలకు మూల స్తంభమైన దైవారాధన- నమాజ్ సంస్థాపన. అదే ముస్లిములందరూ సత్యమార్గాన, తమ నిజ ఆశయ మార్గాన పయనిస్తున్నారనడానికి సంకేతం. వారి వ్యక్తిగత, సామూహిక శీల నిర్మాణానికి పునాది.

వారు తమ ఆశయ మార్గాన సరిగ్గా సాగుతున్నారని చాటి చెప్పే మరో గుర్తు - జకాత్ ! తమ స్వహస్తాలతో కష్టపడి, విశ్వ ప్రభువు ఆదేశాల కాంతిలో సంపాదించినదానిలో ఓ భాగాన్ని ఇష్టపూర్వకంగా సమాజంలోని ఉపేక్షిత జనులకు, అగత్యపరులకు వారి హక్కుగా అందజేసే విధానమే జకాత్. ఇది రెండవ పడి. అంతేకాదు, తమ నిత్య జీవితంలో అడుగడుగునా ఎదురయ్యే ప్రశ్నలకు, సమస్యలకు, చిక్కులకు, సమాధానం లభించగల మూలాధారాన్ని మరువకుండా - మాట పలికే ముందు, అడుగు వేసే ముందు ఆ మూలాధారాన్ని సంప్రదించడం వారి జీవిత పయనంలో మూడవ అంశం.

*విశ్వసించిన పురుషులు, విశ్వసించిన స్త్రీలు వీరంతా ఒకరికొకరు మిత్రులు, సహచరులు. మంచి పనులకై ఆదేశిస్తారు, చెడును నిరోధిస్తారు. నమాజ్‌ను స్థాపిస్తారు జకాత్ విస్తారు. అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు విధేయులయి ఉంటారు. వీరిపైనే అల్లాహ్ కారుణ్యం అవతరించడం తథ్యం. నిస్సందేహంగా అల్లాహ్ అన్నిటా ఆధిక్యతగలవాడు, వివేచనా సంపన్నుడూను.* ***(9 : 71)***

అప్పుడే వారిలోని స్త్రీలయినా, పురుషులయినా పరస్పరం సహచరులయి మంచిని నెలకొలిపేవారుగా చెడును నిర్మూలించేవారుగా అలరారగలుగుతారు. విశ్వప్రభువు కారుణ్యం అప్పుడే వారికి తన ఆశ్రయంలో చోటు కల్పిస్తుంది. మరి ముస్లిములు తమ జీవితాల సముద్ధరణకు సిద్ధమేనా?!

*(సెప్టెంబరు, 1989)*

# 27

సహస్రాది సూర్యగోళాలు, అగణ్య ఆకాశగంగలున్న అనంత విశాల విశ్వానికి విరాట్టు, అపారశక్తుల సర్వోన్నతాధికారి, అనూహ్య సంపదల స్వామి తన అపురూపమయిన సాన్నిహిత్యాన్ని, సహాయాన్ని ఎవరికయినా అందచేస్తాడని అంటే ఆ సహాయం పొందేవాడి సౌభాగ్యం, స్థానం, స్తోమత ఏమయి ఉంటుంది?! అంతా అనిర్వచనీయం, ఊహాతీతం.

మనిషి తాను సాధించిన వైజ్ఞానిక ప్రగతీ వికాసాలు, సాంకేతిక నైపుణ్యాలు తనను ప్రకృతికి అతీత స్థాయికి, మరే శక్తికీ అందని ఎత్తులకు లేవనెత్తాయని భావిస్తున్నాడు.

నిజమే మనిషి ఊర్ధ్వలోకాల్లో అనేక మండలాలకు చేరుకోగలుగు తున్నాడు. సౌరకుటుంబ సభ్యుల్ని పరామర్శించడమే కాక వాటికీ అందనటువంటి కొంగ్రొత్త పుంతల్ని త్రొక్కగలుగుతున్నాడు.

అయితే ఎంత దూరమనీ? అనుక్షణం వేల కిలో మీటర్ల వేగంతో గమ్యం తెలియని పయనం సాగిస్తున్న ఈ బ్రహ్మాండమయిన విశ్వంలో ఎక్కడికని పోగలడు? ఈ విశ్వాన్ని దాటి మరెటు ఎగరగలడు? ఈ విశ్వమంతా ఆ స్వామి అధీనంలో ఉంటే ఆ విశ్వప్రభువును తప్పించుకొని మనగలడా? ఆయన్ని కాదని, ఆయన చూపిన మార్గాన్ని కాదని మనిషి చెయ్య గలిగిందేమిటి?

నేడు ఎన్ని ప్రగతులు సాధించినా ఆయన్ని కాదన్న కారణంగానే మనిషి తోటి వారితో ఎలా మసలుకోవాలో నిర్ణయించుకోలేక పోతున్నాడు. ఎన్ని తత్వశాస్త్రాలు వల్లించినా తన సొంతతత్వాన్ని అర్థం చేసుకోలేక పోతున్నాడు. ఎన్ని నైతిక నియమాలు చేసుకున్నా తాను చేసుకున్న

నియమాలకే నిలబడ లేకపోతున్నాడు. ఎన్ని కుటుంబ, సామాజిక వ్యవస్థ లేర్పరచుకున్నా ఒక్క కుటుంబంలోనూ శాంతి కానరావడం లేదు. ఒక్క సమాజమూ సవ్యంగా సాగటం లేదు. ఎన్నెన్ని ఆర్థిక, రాజకీయ విధానాలు నెలకొలుపుకున్నా సకల రాజకీయ సమస్యలూ నేడు బుసలుకొట్టి భయ పెడుతున్నాయి, ఏ ఆర్థిక విధానం కూడా మనిషి చిక్కుల్ని విడదీయలేక పోతోంది. కారణం- మనిషి ఈ విశ్వప్రభువును, ఈ విశ్వాన్ని పరిపాలిస్తున్న ధర్మాన్ని, ప్రకృతి ధర్మాన్ని త్రోసి రాజనడం.

ఆ ఒక్కమాటను అంగీకరిస్తే ఇన్ని తిప్పలుండవు మనిషికి. ఆ ఒక్క స్వామిని ఆశ్రయిస్తే ఇన్ని వాకిళ్ళముందు వంగవలసిన అవసరం రాదు. ఆయన బాటను అవలంబిస్తే మరే తత్వశాస్త్రమూ, మరే సిద్ధాంతమూ, మరే నైతిక, రాజకీయ, ఆర్థిక విధానమూ చెయ్యలేని పనిని సాధించగలడు మనిషి, అదే నేడు అవసరం.

ఆ మాటనే విశ్వప్రభువు తన అంతిమ సందేశంలో ఇలా తెలిపాడుః

**అల్లాహ్ ఆశ్రయాన్ని పటిష్ఠంగా పట్టుకున్న వ్యక్తి తప్పక సన్మార్గాన్ని పొందుతాడు. *(3 : 101)***

అదేమరి! అల్లాహ్‌ను ఆ విశ్వ విరాట్టును గట్టిగా పట్టుకుంటే, ఆయన శరణు గోరితే సకల ద్వారాలూ తెరచుకుంటాయి. అన్ని బాటలూ విశాలమవుతాయి!

(నవంబర్, 1989)

# 28

**ఆపదలు, విపత్తులు** చెప్పిరావు. అయితే వచ్చినపుడు వ్యక్తినయినా సమాజాన్నయినా తట్టిలేపుతాయి పట్టిచూపుతాయి. కాని వ్యక్తి వాటిని తట్టుకునే స్థితిలో ఉన్నాడా? సమాజం వాటిని ఎదిరించే స్తోమత కలిగిఉందా?? అన్న ప్రశ్నలు ఉదయించినప్పుడు ఆయా వ్యక్తుల లేదా సమాజాల పునాదిలో వేసిన రాళ్ళేమిటో చూడవలసి ఉంటుంది.

సమస్యలు వచ్చిన ప్రతిసారీ గట్టిగా ఎదుర్కోవడం సాధ్యపడదు. కొన్ని పర్యాయాలు సంయమనం పాటించి నిగ్రహం చూపడమే సమంజసవైఖరి కావచ్చు. మరొకప్పుడు నిలకడతో పరిస్థితుల్ని ఎదుర్కొని రక్షించుకోవడమే సవ్యమయిన మార్గం కావచ్చు. ఇంకొకప్పుడు పరిస్థితుల్ని ఎదుర్కొని ఎదురుదాడిచేసి వాటిని తమకనుకూలంగా మలచుకోవడం తప్ప గత్యంతరం లేని అవస్థ ఏర్పడవచ్చు.

ఈ సందర్భాలన్నింటిలోనూ పరిస్థితులకు లొంగిపోయి వాటికనుగుణంగా రూపాంతరం చెందడం అన్నది ఎక్కడా లేదు. కాగా ఎట్టి పరిస్థితిలోనూ తన పాదాల క్రింద నేల జారిపోకుండా జాగ్రత్తపడుతూ సహనస్థయిర్యాలు చూపడం, నిలకడ, ఓరిమి కనబరచడం, ధైర్యసాహసాలు ప్రదర్శించడం, ఆత్మవిశ్వాసం, దీక్షాదక్షతల లాంటి ఉన్నతగుణాలే ద్యోతకమవుతున్నాయి. ఈ గుణగణాలు ఇట్టే పుట్టవు. ఇట్టే పెంపొందవు. ఎంతో శిక్షణ, మరెంతో సాధన అవసరం. మానసిక శక్తి, ఆధ్యాత్మికబలం మెండుగా కావలసివుంటుంది. ఇవి వ్యక్తితో పాటు ఓ సమాజానికి కూడా అవసరమయినప్పుడు ఈ శిక్షణ, సాధనలు సామూహికంగా ఏర్పరచవలసి ఉంటుంది. రమజాన్ అలాంటి ఏర్పాటే.

రమజాన్ నెల, అందులోనే దివ్యఖుర్‌ఆన్ అవతరించింది. అది ఆసాంతం మానవాళికి మార్గదర్శకం. అందులో, రుజుమార్గం చూపే ప్రస్ఫుటమయిన బోధనలున్నాయి; సత్యాసత్యాలను విడమర్చి తెలిపే గీటురాయి ఉంది. మీలో ఆ నెలను కానగలిగిన వారు ఆ నెల అంతా ఉపవాస వ్రతాన్ని తప్పక పాటించాలి. అయితే వ్యాధిగ్రస్తులయి ఉన్నవారు లేదా ప్రయాణంలో ఉన్నవారు తరువాతి దినాల్లో ఉపవాసాల సంఖ్యను పూర్తిచేసుకోవచ్చు. అల్లాహ్ మీ యెడల సౌలభ్యాన్ని కోరుకుంటున్నాడు, కాఠిన్యాన్ని కాదు. మీరు ఉపవాసాల సంఖ్యను పూర్తిచేసుకునేందుకుగాను ఈ పద్ధతి తెలుపడం జరిగింది. తద్వారా అల్లాహ్ మీకు సన్మార్గం చూపినందుకుగాను మీరు ఆయన ఘనతను కొనియాడాలి, ఆయనకు కృతజ్ఞతలు తెలుపుకోవాలి.

**(2 : 185)**

విశ్వసించిన వారందరూ కలిసి ధర్మసంస్థాపనా మార్గంలో కృషి చేస్తున్నప్పుడు ఎదురయ్యే కష్టనష్టాలను ఎదుర్కోవడానికి, అన్ని పరిస్థితుల్లోనూ సన్మార్గాన, ధర్మమార్గాన స్థిరచిత్తంతో ముందుకు సాగడానికి కావలసిన మానసిక, ఆధ్యాత్మిక శక్తి సామర్థ్యాలను ఇచ్చేదే రమజాన్.

రండి దాన్ని మన సొంతం చేసుకుందాం.

*(ఫిబ్రవరి, 1990)*

# 29

**సత్యం– సత్యమే** జీవనసారం, సత్యమే సదా సాఫల్య ద్వారం, సత్యమే సతతం సమున్నతికి సోపానం– ఇహంలోనూ, పరంలోనూ.

సత్యం కాంతిపుంజం, భగభగమండే అగ్ని గుండం, సత్యం సూర్యగోళం. సూర్యుడు ఉదయించగానే నీలి మేఘాలు బహు దూరాల నుంచి ముసురుకు వస్తాయి. వాయువు తోడయితే సూర్య ప్రకాశానికి తెరవేస్తాయి. సత్యప్రభ భాసిల్లినప్పుడు మిథ్యాంధకారం అలుముకునేందుకు పరుగెడుతుంది. వాతావరణం సహకరిస్తే సత్యాన్ని కప్పివేస్తుంది. సత్యాన్ని అసత్యం కప్పివెయ్యడం, సత్యాన్ని మిథ్య మరుగుపరచడం, సత్యం అపరిచిత పదార్థమయిపోవడం, సత్యం ఏ మూలనా కానరాకపోవడం, సత్యాన్ని తిరస్కరించడం, అదసలు లేదు పొమ్మనడం– అదే తిరస్కారం, అదే కుఫ్ర్. అదే అధర్మం, అదే అన్యాయం, అదే అవినీతి, అదే, అదే అవిశ్వాసం, అదే ఘోరాతి ఘోరమైన అత్యాచారం.

అప్పుడే సత్యం సమర శంఖం పూరిస్తుంది. సమరం– మిథ్యావాదంతో, అసత్యంతో, అన్యాయంతో, అధర్మంతో, అత్యాచారంతో, అవినీతితో, అవిశ్వాసంతో. సమరం– ఉక్కు కరవాలంతో కాదు, మందు తూటాలతో కాదు, అణ్వాయుధాలతో కాదు. ఈ సమరంలో సత్యం చేతిలో ఒకే ఆయుధం – అదే సత్యం– సత్యతాకరవాలం!

సత్యంలేని జీవితం నిస్తేజం, నిర్జీవం, నిర్వీర్యం. సత్యం లేని ఆంతర్యం దీపం లేని ఇల్లు. సత్యం లేని హృదయం జీవం లేని కళేబరం. సత్యానికి స్పందించని గుండె చలనంలేని బండరాయి. సత్యానికి పరితపించని మనస్సు కొడిగట్టిన దీపం.

అందుకే సత్య సమరం సాగాలి. సత్య సమరం సాగనిదే శాంతి స్థాపన జరగదు. సత్య స్థాపనే శాంతి స్థాపన!

సత్య స్థాపన ఎక్కడ జరగాలి? గాలిలోనా? గోడలపైనా? గోపురాల పైనా? గుంబద్‌ల పైనా? గోరీల పైనా? కాదు, మీ గుండెల్లోని కానరాని చీకటి గదుల్లో! అప్పుడు అంతర్యంలో శాంతి నెలకొంటుంది. అంతర్యంలోని శాంతి ప్రసరింపజేసే కాంతి పుంజాలే బాహ్యంలోనూ శాంతి స్థాపన చేస్తాయి. మీ హృదయంతో సత్య సమరానికి సిద్ధమేనా మీరు?

బాగా వినండి, మీరు మీ స్వామి చెంత చేరినప్పుడు ఆయన ప్రకటించేదేమిటో బాగా ఆలకించండి, ఆలోచించండి:

**అప్పుడు అల్లాహ్ ప్రకటిస్తాడు: ఇది, సత్యవంతులకు వారి సత్యం లాభించే దినం. వారి కోసం దిగువన కాలువలు ప్రవహించే తోటలున్నాయి. వారక్కడే సదా నివసిస్తారు. అల్లాహ్ వారి పట్ల ప్రసన్నుడయ్యాడు. వారున్నూ అల్లాహ్ పట్ల సంతుష్టులయ్యారు. ఇదే గొప్ప సాఫల్యం.**

***(5 : 119)***

దైవ ప్రసన్నతలోనే శాంతి జనిస్తుంది. మానసిక సంతుష్టిలో నుంచే శాంతి ఉద్భవిస్తుంది. సత్యమే శాంతికి మార్గం.

*(మే, 1990)*

# 30

త్యాగం సామాజిక జీవనానికి జీవనాడి. సమాజం సజావుగా సాగాలంటే సభ్యుల్లో త్యాగశీలం అనివార్యం.

త్యాగం-తనువులో చూపాలి, మనసులో చూపాలి, ధనంలో చూపాలి, సమయంలో చూపాలి, శక్తిలో చూపాలి. త్యాగం తన కోసం చెయ్యాలి, తనవారి కోసం చెయ్యాలి, పరాయి వారికోసమూ చెయ్యాలి. త్యాగం - ఆశయాల కోసం, ఆదర్శాల కోసం, తత్సమయ లక్ష్యాల కోసం, చిరకాల సాఫల్యాల కోసం, తాత్కాలిక గమ్యాల కోసం, శాశ్వత మార్గాల కోసం- జీవితం అంతా త్యాగాల తోరణాలునిండితేనే అందులో పండు వెన్నెల పండుతుంది, గుండెనిండా నెమ్మది నిండుతుంది. అందుకే సమాజం త్యాగాలను కోరుతుంది.

త్యాగం లేనిదే సమాజంలో అనురాగమూ లేదు, అనురక్తీ లేదు. మనుగడలో మమతలు పెరగాలంటే ప్రతి వ్యక్తీ ఎదుటివారి కోసం ఏదో ఒకటి త్యాగం చెయ్యవలసి వస్తుంది- కోరికల్నీ త్యాగం చెయ్యవలసి వస్తుంది, కాంక్షల్నీ త్యజించవలసి వస్తుంది, మనసయిన మార్గాలనూ వదలుకోవలసి వస్తుంది.

త్యాగం లేనిదే ఏ ఆశయమూ సిద్ధించదు. ఆశయం ఎంత ఉన్నతమయిందో త్యాగాలూ అంతే విస్తృతమయి ఉంటాయి. ఆశయం ఎంత పవిత్రమయిందో త్యాగాలు అంతే నిష్ఠను, చిత్తశుద్ధినీ కోరుతాయి.

ముస్లిముల జీవితాశయం- ఒక్క మాటలో చెప్పాలంటే-భువిలో విభుని మాటే చెల్లాలి అన్నది. దాని వివరణః మనిషి తన వ్యక్తిగత జీవితంలోనూ అడుగడుగునా, క్షణక్షణాన సృష్టికర్త ఆదేశాలనే పాటించాలి. అతని సామూహిక జీవితంలోనూ అన్ని రంగాల్లోనూ ఎల్లెడలా ఆ పరమ ప్రభువు ఇచ్ఛే నెరవేరాలి.

ఈ ఆశయానికి ప్రతి ముస్లిమ్ వ్యక్తిగతంగానూ, ముస్లిముల సమాజం సామూహికంగానూ బాధ్యత వహించవలసి ఉంటుంది. అయితే విశ్వప్రభువు అభీష్టం ఏమిటి?

చెడు సమసిపోవాలి, మంచి పరిఢవిల్లాలి! వ్యక్తిలోనూ, సమాజంలోనూ!!

ఈ ఆశయసిద్ధి కోసమే ముస్లిమ్ జీవితమంతా కృషి చేస్తుంటాడు, పోరాడుతూ ఉంటాడు. అతని పోరాటం దుష్ట శక్తులతో, మిథ్యావాదాలతో, వినాశకర దృక్పథాలతో నిరంతరం సాగుతూ ఉంటుంది.

ఈ సంఘర్షణకు, చెడుతో జరిగే ఈ పోరాటానికి సమాయత్త పరచడానికి ఉద్దేశించబడినవే- ఇస్లామ్ ప్రతిపాదించే సకల ఆరాధనలు, సకల ఉపాసనా రీతులు, నైతిక వ్యవస్థ, సామాజిక విధానం, రాజకీయ సిద్ధాంతం- ఇస్లామీయ జీవన వ్యవస్థ అంతా ఈ తర్ఫీదుకు దోహదపడేదే.

ఆ తర్ఫీదు, సుశిక్షణల అంతర్భాగమే "హజ్" యాత్ర కూడా. అందులో మనిషి ఆంతర్యంలో ఉద్భవించే కాంక్షల్ని, వాంఛల్ని మాత్రమే కాక సకల దౌర్బల్యాలను జయించాలని హజ్ శిక్షణనిస్తుంది. శిక్షణలో అంతర్భాగంగానే మనిషి మోహావేశాలన్నింటికీ, రుచులన్నింటికీ దూరం కావాలని నిర్దేశిస్తుంది దైవాదేశం :

**హజ్ నెలలు అందరికీ తెలిసినవే. ఈ నిర్ణీత మాసాల్లో హజ్ సంకల్పం చేసుకున్న వ్యక్తి అప్రమత్తుడయి మెలగాలి. హజ్ కాలంలో అతను ఏ విధమయిన కామచేష్టకు, పాపపువనికి, పోట్లాటకు పాల్పడకుండా జాగ్రత్త పడాలి. మీరు చేసే సత్కార్యం ఏదయినా అది అల్లాహ్‌కు తెలుస్తుంది. హజ్ యాత్రకు ప్రయాణ సామగ్రిని తీసుకుని మరీ బయల్దేరండి. అన్నింటికంటే ఉత్తమమయిన ప్రయాణ సామగ్రి నిష్ఠాగరిష్ఠత. కాబట్టి వివేచనావరులారా, నా పట్ల అవిధేయతనుండి తప్పుకు మెలగండి. (2 : 197)**

*(జులై, 1990)*

# 31

**ఓ మనిషిని** ఎగతాళి చెయ్యడం, పరిహసించడం, ఆటపట్టించడం, అతని మాటలు చెప్పుకుని నవ్వుకోవడం - ఎంత కాలం జరుగుతుంది సామాన్యంగా? ఓ గంట, రెండు గంటలు; ఓ పూట, రెండు పూటలు; రోజులు, నెలలు- కాదు, కాదు, సంవత్సరాల తరబడి, అంతేకాదు శతాబ్దాల తరబడి!

నమ్మశక్యం కాదు! ఇది నమ్మమని ఎవరు ఎంత గట్టిగా చెప్పినా నమ్మలేము. అయితే ఇది వాస్తవం. ఎవరు నమ్మినా నమ్మకపోయినా, ఎవరు అవునన్నా ఎవరు కాదన్నా ఇది మటుకు చారిత్రక వాస్తవం. ఈ పుడమిపైన పుట్టిన ఓ మనిషిని తోటి మనుషులు అతని జీవిత కాలంలోనే పరిహసించడం మొదలెట్టారు. ఆ తరువాత అతను ఈ లోకాన్ని వదలివెళ్ళినా, అతని వెనక కూడా అతన్ని పరిహసిస్తూ ఉన్నారు ప్రజలు. ఓ సత్యసంధుణ్ణి, ఓ పరమ పవిత్రుణ్ణి, అందరి మేలును కోరేవాణ్ణి, అందరికీ మంచిని పంచి పెట్టాలని కాంక్షించినవాణ్ణి, అందరి బాగు కోసం ఎన్ని కష్టాలనయినా భరించడానికి సిద్ధపడినవాణ్ణి, తనవారికోసం ఎన్ని పాట్లుపడినా ఎలాంటి ప్రతిఫలాన్నీ కోరనివాణ్ణి ప్రజలు 'కవి' అని త్రోసిపుచ్చారు, మంత్రగాడని తూలనాడారు, పిచ్చివాడని పరిహసించారు.

ఆ పరిహాసం ఒకనాటిది కాదు. ఆయన పుట్టి, తన సేవలను ముగించుకుని, సేవా చిహ్నాలను వదలి, తనువు చాలించిపోయి, పదిహేను శతాబ్దాలు గడిచినా ఆయన్ని పరిహసించడం మటుకు మానుకోలేదు ప్రజలు.

ఈ పరిహాసం ఒక యుగంతో ముగియకపోవడమే బాధాకరం, ఆశ్చర్య కరమనుకుంటే పరిహసించేవారు ఒక్క దేశంలోనే కాక, అన్ని దేశాల్లోనూ,

అన్ని యుగాల్లోనూ ఉండడమే మరీ గుండెల్ని పిండేస్తుంది. మరీ సంభ్రమంలో ముంచివేస్తుంది.

అయితే ఆ వ్యక్తి చేసిన ఏ 'చర్య' కారణంగా ఇంత రభస జరిగింది- ఇంకా జరుగుతోంది?! ఈ విశ్వ ప్రభువు ఒక్కడే మన పూజాపురస్కారాలకు, విధేయతా భావాలకు అర్హుడని చాటాడాయన. రానున్న ఓ గడ్డు దినం గురించి హెచ్చరించాడాయన. దివ్య గ్రంథం ఈ విషయాన్ని ఇలా ప్రస్తావించింది:

"ఈ సత్యతిరస్కారులు నిన్ను చూడగానే వేళాకోళం చేస్తారు. 'ఈయనగారేనా మీ దైవాలను ప్రస్తావించేవాడు' అని అంటారు. స్వయంగా వీరి పరిస్థితి ఏమిటంటే, వీరు ఆ కారుణ్య ప్రభువు సంస్మరణను పూర్తిగా తిరస్కరిస్తున్నారు. నిజానికి మనిషి తొందరపాటు జీవి. మీరు తొందర పెట్టకండి, నేనిప్పుడే నా నిదర్శనాలను చూపిస్తాను. వీరు, 'అయితే, నీవు నిజం చెప్పేవాడివయితే ఈ బెదరింపు ఎప్పుడు నెరవేరబోతోంది?' అని ప్రశ్నిస్తున్నారు. అయ్యో, ఈ తిరస్కారులకు, ఇటు తమ ముఖాలను అటు తమ వీపుల్నీ మంటల నుండి తప్పించుకోజాలని, ఎటునుంచీ సహాయం లభించని సమయం గురించి తెలిసి ఉంటే ఎంత బావుండేది! ఆ విపత్తు అకస్మాత్తుగా వచ్చిపడుతుంది. వీరిని ఒక్కసారిగా పట్టుకుంటుంది – అప్పుడు వీరు దాన్ని వదిలించుకోనూ లేరు, వీరికి క్షణం వ్యవధి కూడా దొరకదు. నీకు పూర్వం కూడా ప్రవక్తల్ని పరిహసించడం జరిగింది. కాని వారిని పరిహసించిన వారు తాము దేన్ని గురించి పరిహసిస్తూ వచ్చారో అందులోనే చిక్కుకు పొయ్యారు." **(21 : 36–41)**

(అక్టోబర్, 1990)

# 32

**కాలం అంటే** ఏమిటీ? క్షణాలా? గంటలా? నిముషాలా? రోజులా? నెలలా? సంవత్సరాలా? శతాబ్దులా? యుగాలా? - ఏమిటి కాలం అంటే?? క్షణం కూడా కాలమే, యుగం కూడా కాలమే, జీవితం కాలమే, ప్రపంచమూ కాలమే. కాలం తప్ప ఏముంది బ్రతుకులో?

మనిషి జీవితం కాలం. మనిషికి కావలసింది కాలం. మనిషి కోరుకునేది కాలం. మనిషికి సర్వస్వం కాలం. మనిషి వెలకట్టలేని సంపద కాలం. మనిషి సంపాదించలేని ధనం కాలం. ప్రభువు ప్రసాదించిన వరం కాలం. కాలం వినా ఏముంది బ్రతుకు?

కాని --

కాలం కరిగిపోతోంది - మంచుముద్దలా ! కాలం మరిగి ఇగిరిపోతోంది- కాగే నీరులా!! కాలం గిరగిరా తిరుగుతోంది రథచక్రంలా!!! కాలం బిరబిరా దూసుకుపోతోంది రవి కిరణంలా!!!!

అంటే --

బ్రతుకు క్షణక్షణమయి - భవిష్యత్తు నుండి కరిగి, వర్తమానంలో ఇగిరి, గిరాగిరా భ్రమరించి అనంత గతంలోకి చొరబడి పరిగెడుతోంది! కనుమరుగవుతోంది!!

అందుకే --

కాలంమీద పట్టుగలవాడు, యదార్థాన్ని గ్రహించగలిగినవాడు, యదార్థాన్ని గట్టిగా నమ్మినవాడు - వాడే జీవన పరమార్థాన్ని తెలుసుకున్నవాడు.

యదార్థాన్ని గ్రహించడమే కాదు, దాన్ని విశ్వసించడమే కాదు, ఆ విశ్వాసానికి సుగుణం ఆచరణ. యదార్థం చూపే విధంగా ఆచరించేవాడు, ఆలోచనల్లో ఆచరణల్లో ఏకత సాధించినవాడు - వాడే పరమార్థాన్ని సాధించినవాడు!

సత్యాన్ని గ్రహించి సదాచరణను కొనసాగిస్తే మనిషి వ్యక్తిగతంగా సాధకుడవుతాడేమోకాని - మానవ జీవితం ఒంటరి పోరాటం కాదు, ఉమ్మడి సంఘర్షణ. అందుచేత సత్యాన్ని సమాజంలో వ్యాపింపజెయ్యడం కూడా అతని బాధ్యతే. సత్యాన్ని బోధిస్తే, సత్యం కోసం మనిషి జరిపే ఒంటరి పోరుకు, సమాజం చేసే సంయుక్త సంఘర్షణను జోడిస్తే మార్గంలో ఇక్కట్లు వస్తాయి, ఇబ్బందులు వస్తాయి, పరీక్షలెదురవుతాయి. అన్నింటినీ తట్టుకుని దీటుగా నిలవాలి. సహనంతో స్థయిర్యంతో మనిషి తన ఒంటరి పోరులో నిలకడగా మెలగాలి, ఉమ్మడి పోరాటంలో ఓరిమి చూపాలి. అప్పుడే బ్రతుక్కు అర్థం సిద్ధిస్తుంది, కాలం సార్థకమవుతుంది. దివ్యగ్రంథం చెప్పేది కూడా అదే :

***"కాలం ప్రమాణంగా! మానవుడు నిజానికి భారీ నష్టానికి లోనయి ఉన్నాడు- విశ్వసించిన వారు, సదాచరణ చేసేవారు, పరస్పరం సత్యాన్ని బోధించుకున్న వారు, సహనాన్ని ఉపదేశించుకున్నవారు తప్ప!" (103 : 1-3)***

మనం ఈ నాలుగు గుణాలు సంతరించుకుని, హరించుకుపోతున్న బ్రతుకు కాలాన్ని సద్వినియోగం చేసుకోవడానికి సిద్ధంగా ఉన్నామా?

(ఏప్రిల్ ,1991)

# 33

**అందమయిన ముఖం,** పొందికయిన అంగ సౌష్టవం, ఆరోగ్య వంతమయిన శరీరం - మానవునికి ప్రకృతి ప్రసాదించిన మహా వరాలు.

ఇవి మనిషి తాను కోరి, ఎంచుకున్న వరాలు కావు. కోరుకున్నా, పొందాలని ప్రయత్నించినా లభించేవి అంతకన్నా కావు. వద్దనుకుంటే పోయేవీ కావు. ఇవి సృష్టికర్త యిచ్చిన వరప్రసాదాలు.

ఇలా తన ప్రమేయం లేకుండా, తనకు తెలీకుండానే లభించిన తన ఈ ఆకృతిని, అంగాంగాలను చూసుకుని ఆనందిస్తూ అడక్కుండానే తనకు వీటినిచ్చిన ఆ కర్తను, స్వామిని, తన నిజ ప్రభువును మరచిపోతున్నాడు మనిషి.

ఆ ప్రభువు తనకు ఈ శరీరాన్నే కాదు, ఈ ప్రపంచాన్నీ అనుగ్రహించాడు. తనకు ఇష్టమయిన రీతిలో ఈ శరీరాన్ని, దాని ప్రతి అంగాన్నీ, ప్రతి అవయవాన్నీ వాడుకునే అధికారాన్నిచ్చాడు. అంతేకాదు తన అధీనంలో వుంచిన ఈ ప్రపంచాన్ని సయితం తన ఇచ్ఛ వచ్చినట్లు వినియోగించుకునే స్వేచ్ఛనూ ప్రసాదించాడు. కేవలం ఈ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలే కాదు, వాటికి తగ్గ శక్తి సామర్థ్యాలను, వనరుల్ని, సాధన సంపత్తినీ ఇచ్చాడు. వీటినన్నింటినీ వినియోగించుకునే బుద్ధిబలాన్ని కూడా ప్రసాదించాడు.

ఇంకా - వీటిలో తనకు మేలయినదేదో, చెడుగు చేసేదేదో తెలుసుకునే విచక్షణా జ్ఞానాన్నీ, వివేచననూ అనుగ్రహించాడు.

అంతేకాదు తాను స్వయంగా తన శక్తి సామర్థ్యాలతో, బుద్ధీ వివేకాలతో గ్రహించలేని, తెలుసుకోలేని సత్యాలను తెలుపడానికి తన సందేశహరుల్ని,

తన బోధకుల్ని సయితం నియమించాడు ఆ కరుణా స్వరూపుడయిన పరమ ప్రభువు.

అయితే ఇన్ని ఇచ్చిన స్వామి మనిషిని అట్టే గాలికి వదిలేశాడా? వదిలేశాడన్న ఈ భ్రమ వల్లనే మనిషి కళ్ళెంలేని గుర్రంలా వ్యవహరిస్తున్నాడు. ఇష్టా రాజ్యం సాగిస్తూ పగ్గాల్లేని ఆంబోతులా తలబిరుసుతనంతో విర్రవీగుతున్నాడు. దివ్యఖుర్‌ఆన్ ఇలా హెచ్చరిస్తోంది :

**మానవుడా, నిన్ను పరమ ఉదారుడయిన నీ ప్రభువుపట్ల మోసంలో పడవేసిన విషయం ఏమిటి? ఆయన నిన్ను సృష్టించాడు, నిన్ను నఖశిఖ పర్యంతం తీర్చిదిద్దాడు. నిన్ను సంతులితంగా, సముచితంగా రూపొందించాడు. తాను కోరిన రూపంలో నీ శరీరాన్ని పొందికగా కూర్చి తీర్చి దిద్దాడు. (నీవు మోసానికి గురి కావడానికి కారణం) మరేమీ కాదు. మీరు (మానవులు) ప్రతిఫలదినాన్ని తిరస్కరిస్తున్నారు. వాస్తవానికి మిమ్మల్ని కనిపెట్టే ఉండేవారు నియమితులయి ఉన్నారు. గౌరవనీయులయిన లేఖకులు, మీరు చేసే ప్రతి పనినీ ఎరిగినవారు. (82 : 6 – 12)**

(మే, 1991)

# 34

**ఈ లోకం** - అనుక్షణం వృద్ధి చెందుతూ, విద్యతో విజ్ఞానంతో వికసిస్తూ దర్శనమిచ్చే ఈ లోకం - అసంఖ్యాక త్యాగాల గాధలు తన చరిత్ర పొరల్లో నిక్షిప్తం చేసుకుంది.

కాలం నాలుగు వేల సంవత్సరాల వెనక్కి పయనిస్తే ఓ మహా త్యాగమూర్తి దర్శనమిస్తాడు. ప్రవక్తల పితామహుడాయన. వందల మైళ్ళ వరకు మానవ సంచారం కానరాని ఎడారి కొండల మధ్య గల ఓ లోయలో ఆయన్ని ఊహించండి. ఏకాకిగా - కాదు, వృద్ధాప్యం నిండిన ఓ మహిళామణి, ముక్కు పచ్చలారని ఓ శిశువు ఆయనతో పాటు ఆ నిర్మానుష్య ప్రదేశంలో ఆయన సహచర్యంలో ఉన్నారు. ఆయన తన సతీమణిని, పాల బుగ్గల తనయుణ్ణి మలమలమాడే ఆ ఎడారి కొండల మధ్య వదలి పోబోతున్నాడు. ఈ ఉదంతం - కొండల సాక్షిగా, ఎడారి సాక్షిగా, ఏ జీవరాశీ సంచరించని వాతా వరణం సాక్షిగా సాగిన ఘటనం - ఊహిస్తేనే గుండె ద్రవించే ఆ పరిసర ఉదంతం చరిత్రను గొప్ప మలుపు త్రిప్పబోతోందని ఆనాడు ఆ పరిసరాలు ఊహించి ఉండవు.

కాని ఆ ప్రవక్త పితామహుడు, హజ్రత్ ఇబ్రాహీమ్ దాన్ని చూచాయగా ఊహించారు. ఆ ఊహ, ఆ ఆకాంక్ష, ఆ ఆవేదన ఆయన ఆనాడు చేసిన వేడుకోలులోనే ప్రస్ఫుటమవుతోంది :

*"ప్రభూ, [నేను నా ఆలుబిడ్డల్ని ఇక్కడ వదలి పునాది వేస్తున్న] ఈ [మక్కా] నగరాన్ని శాంతి నగరంగా రూపొందించు; నన్నూ నా సంతానాన్నీ విగ్రహారాధన నుండి కాపాడు; ప్రభూ, ఈ విగ్రహాలు అనేక ప్రజల్ని దారి తప్పించాయి. [నా సంతానంలో] నా విధానాన్ని అనుసరించినవాడే నావాడు. పోతే నా విధానానికి భిన్నమయిన పద్ధతులు అవలంబించేవారి*

విషయంలో, నిస్సందేహంగా నీవు మన్నించే కరుణామయుడవు. ప్రభూ, నా సంతానంలోని వారిని నీటి బొట్టూ పుట్టని గడ్డిపోచా పెరగని ఈ కొండ లోయలో నీ పరిశుద్ధ గృహం వద్ద వశింపజేశాను. ప్రభూ, ఇక్కడ జనులు నమాజ్ (నీ ఆరాధన)ని స్థాపించాలని నేను ఇలా చేశాను. కనుక ప్రజల హృదయాలను వీరి వైపునకు ఆకర్షింపజెయ్యి, వీరికి భుజించేందుకు ఫలాల ననుగ్రహించు- తద్వారా వీరు నీకు కృతజ్ఞులవుతారు. ... నా ప్రభూ, నన్ను నమాజ్ని స్థాపించేవానిగా చెయ్యి , నా సంతానంలోనూ, [ఈ సత్కార్య పరాయణులయిన వారిని ఆవిర్భవింపజెయ్యి]. ప్రభూ, నా ప్రార్థన నాలకించి మన్నించు, ప్రభూ, లెక్కల గణన వ్యవస్థస్థాపన జరిగే ఆనాడు నా మాతాపితలకు, విశ్వసించేవారికందరికీ క్షమాభిక్ష ప్రసాదించు".

**(14 : 35-41)**

ఈ ప్రార్థనా ఫలాలే మక్కా మహానగరం, అంతిమ దైవ సందేశహరులు ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లమ్.

(జూన్, 1991)

# 35

**జీవితం ఓ** సమరాంగణం. ఏ దిశలోనయినా, ఏ దశలోనయినా ప్రపంచంలో మనుగడ సాగాలంటే పోరాటం తథ్యం.

మానవ మనుగడకే అనివార్యమయింది పోరాటం -సత్యం, ధర్మం, న్యాయం లాంటి ఉన్నత మానవీయ ప్రమాణాలు మనగలగాలంటే ఆ పోరాటం మరీ ఉధృతమవుతుంది, మరీ ముమ్మరం అవుతుంది. కారణం - సత్యం కటువయింది, కరుకయింది, చేదయింది, చెరగనిది.

'సత్యం' రంగంలో సవాలుగా నిలిచినప్పుడల్లా అసత్యం, అధర్మం, అన్యాయం ఒకటయి దానికి గట్టి పోటీ నిచ్చాయి. సత్యానికి నిలువ నీడ లేకుండా చెయ్యాలని సంకల్పించాయి. అలాంటి సందర్భాలన్నింటిలో సంఘర్షణ స్థాయి పెరిగి సమరంగా రూపొందింది.

సత్యాన్ని ఆశ్రయించినవారు సదా బలహీనులు. పీడితులు, తాడితులే. అసత్యానికి ఆశ్రయమిచ్చినవారు సతతం సమాజంలో సిరి, సంపద, పరపతి, పలుకుబడి, అంగ బలం, కండబలం మెండుగావుండేవారే. ఫలితంగా సత్యా సత్యాల సమరంలో సత్య ప్రేమికులు, అసత్య ధ్వజవాహకుల యెదుట భారహీనులుగానే అగుపడ్డారు. బాధలకూ వారే గురయ్యారు. అయినా మనోబలం, ఆత్మబలం, విశ్వాస బలం వారి సొంతం. అందువల్లనే వారు అసత్యం సమక్షంలో నిలకడ ప్రసాదించమనే నిత్యం తమ ప్రభువును వేడుకునే వారు.

*"దీనికి పూర్వం కూడా అనేక మంది ప్రవక్తలు గతించారు. వారితోపాటు కలసి దైవభక్తులు పోరాడారు. దైవ మార్గంలో వారికి ఎదురయిన ఆపదల వల్ల వారు అధైర్యపడలేదు; బలహీనత కనబరచలేదు; అసత్యం సమక్షంలో*

తలవంచలేదు. ఇలాంటి సహన స్థయిర్యాలు గల వారి పట్లనే అల్లాహ్ ప్రేమజూపుతాడు. వారు కేవలం ఇలా వేడుకునేవారు, 'మా ప్రభూ, మా తప్పిదాలను, లోటుపాట్లను మన్నించు. మా పనిలో నీ హద్దుల ఉల్లంఘన జరిగి ఉంటే దాన్ని క్షమించు. మా పాదాలకు నిలకడ ప్రసాదించు. తిరస్కారులకు ప్రతిగా మాకు సహాయపడు'. చివరికి అల్లాహ్ వారికి ప్రపంచ ఫలితాలనూ ప్రసాదించాడు, అంతకు మించి పరలోక సాఫల్యాన్నీ అనుగ్రహించాడు. అల్లాహ్‌కు ఇలాంటి సదాచార సంపన్నులంటేనే ఇష్టం."

(3 : 146 – 148)

(జులై, 1991)

# 36

**భూమి, ధరిత్రి,** ధరణి, పృధ్వి, పుడమి, క్షోణి, నేల, వసుంధర- ఎన్ని అందమయిన పేర్లు! గగన భువనాలలోనే అత్యంత రమ్యమయిన, రమణీయమయిన, సుందరమయిన, సొగసయిన గోళం - భూగోళం. ఇందులో సృష్టికర్త సకల సౌభాగ్యాలను ఏకత్రంచేసి, అన్ని సంపదల్నీ పొందుపరచి, వాటిలో సౌందర్యాన్నే కాక, సామరస్యాన్నీ, సామంజస్యాన్నీ, సంతులనాన్నీ, సువ్యవస్థనూ ఏర్పరిచాడు. ప్రకృతి దీన్ని కడు హుందాగా, విజ్ఞతతో సమన్వయంతో నిర్వహిస్తోంది.

ప్రకృతి నడిపే ఈ కార్ఖానాలో మనిషి నిమిత్తమాత్రుడూ కాడు, సర్వాధికారీ కాడు. స్వేచ్ఛా జీవి అయినా, ఓ శాసనం, ప్రకృతి శాసనం అతన్ని అతనికి తెలయకుండానే శాసిస్తూ ఉంటుంది. అలాంటి శాసనాల్లోని ఓ శాసనమే - యోగ్యులయిన వారికే మనుగడ - అన్నది. యోగ్యుడయిన వాడంటే శక్తిమంతుడనీ, యుక్తిమంతుడనీ అర్థం చేసుకున్నాడు చార్లెస్ డార్విన్. సృష్టిలో పరిణామక్రమం ఈ రూపంలోనే జరుగుతోందని సిద్ధాంతీకరించాడు. ఈ సిద్ధాంతాన్నే కార్ల్ మార్క్స్ సామాజిక వ్యవస్థకు వర్తింపజేశాడు. దానికీ పరిణామ క్రమాన్ని అంటగట్టి ఆ క్రమంలో ఇప్పుడు శ్రామికవర్గం ఆధిక్యత కావాలన్నాడు. డార్విన్ ప్రతిపాదించిన పరిణామక్రమం మనిషి వరకు వచ్చి ఆగిపోయినట్టే, మార్క్స్ పరిణామక్రమం శ్రామిక వర్గం వరకు వచ్చి నిలిచిపోయింది. నిజానికి వీరిరువురూ పప్పులో కాలు వేసిందిక్కడే.

శక్తీయుక్తులకన్నా ప్రధానమయిన, ప్రముఖమయిన మరో అంశాన్ని వీరు గుర్తించలేకపొయ్యారు. అదే నీతి. నీతి, శక్తి, యుక్తి ఈ మూడు సమగ్రంగా సమన్వయించినప్పుడే మనుగడ సుగమం అవుతుంది. అయితే ఆ 'నీతి' మానవ నిర్దేశితం కాదు. విశ్వసృష్టికర్త, విశ్వ ప్రభు నిర్ధారితం. దాన్నే దైవ

మార్గమని అంటాము. అందులో నైతికంగా యోగ్యులయిన వారి సముదాయమే సదా మనగలుగుతుంది. అదే దివ్యఖుర్‌ఆన్ అభిభాషణః

"విశ్వసించిన వారలారా! మీకేమయింది? దైవ మార్గంలో బయల్దేరమని మిమ్మల్ని కోరినప్పుడు మీరు నేలకు అంటుకుపొయ్యారు. అవునూ, మీరు పరలోకానికిబదులు ప్రపంచ జీవితాన్నే కోరుకుంటున్నారా? అలాగయితే మీరు నిజం తెలుసుకోండి, ప్రపంచ జీవితపు ఈ సకల సామగ్రి, సాధనా సంపత్తి పరలోకంలో అతి అల్పమయిపోతుంది. మీరు బయలు వెడలకపోతే దైవం మీకు బాధాకరమయిన శిక్ష విధిస్తాడు – మీ స్థానంలో మరో వర్గాన్ని ముందుకు తెస్తాడు; మీరు దైవానికి ఏ హానీ తలపెట్టలేరు, ఆయన అన్నిటా అధికారం గల శక్తిమంతుడు."

(9 : 38–39)

(ఆగస్టు, 1991)

# 37

**జీవితం అసంఖ్యాక** సమస్యల సమాహారం. ప్రతి సమస్యకు సహస్రాది మార్గాలు. మనిషి దేన్నని స్వీకరించాలి, దేన్నని అనుసరించాలి! మనసు చూపే మార్గమొకటి, మేధ తెలిపే పద్ధతి ఒకటి. కోరికలు కోరే బాట ఒకటయితే ఆంతర్యం అందజేసే సంకేతం వేరొకటి. ఇంటివారు ఒకటి కావాలంటే సమాజం అది వద్దంటుంది. బంధుమిత్రుల సూచన ఓ వైపున ఉంటే పరిపాలకుల ఆదేశాలు దానికి భిన్న దిశలో ఉంటాయి. మనిషి ఎటని పోతాడు, ఏమని చేస్తాడు, ఎవరికి తృప్తి కలగజేస్తాడు, ఎవరిని సంతుష్టపరుస్తాడు?

విజ్ఞానం ఎంత వెలుగు వెదజల్లినా, శాస్త్రాలు ఎన్ని సూత్రాలు వల్లించినా, అనుభవం ఎన్ని అవధులుదాటినా మనిషి జీవితం నేటికీ దుర్భరం, అంధకార బంధురం, అగమ్యగోచరంగానే మిగిలిపోయింది. దారి చూపగలిగిన వారే దారులు వెదుక్కుంటున్నారు.

ఎవరు ఎన్ని మార్గాలు అన్వేషించినా, ఎన్ని విధానాలు తెలిపినా అవన్నీ ఊహాజనితమయినవే, ఆధారరహితమయినవే. ఎందువల్లనంటే మనిషికి మౌలికమయిన కాంతి లేదు. పదార్థాలను అన్ని కోణాలనుండి చూడగలిగే దృష్టిలేదు. పదార్థాల అంతర్ బాహ్య స్వరూపాలను ఒకేసారి గ్రహించగలిగే బుద్ధిలేదు. అర్థంచేసుకునే ఆంతర్యం లేదు. ఈ లోపాల వల్ల జీవన మార్గాలు మరింత చిక్కులో పడ్డాయి. మరిన్ని కొత్త పుంతలు ఉనికిలోకి వచ్చాయి. ఒక బాటలో దెబ్బతిన్న మనిషి మరో త్రోవతొక్కడం, అక్కడ ముందుకు సాగలేక మరో దారి చూసుకోవడం – ఇలా జీవితం ప్రయోగాల, అనుభవాలతోనే నిండిపోయింది. సజావుగా సాగలేకపోతోంది.

కావలసిన కాంతి, అవసరమయిన దృష్టి, ముఖ్యమయిన బుద్ధి వీటన్నింటికీ నిలయమయిన శక్తి పరాత్పరునిది, విశ్వకర్తది, పరమ ప్రభువుది. ఆయన్ని నమ్మి, ఆయన చూపిన బాటలో నడిస్తే ఆ వెలుగు లభిస్తుంది, ఆ చూపు, ఆ తెలివి ప్రాప్తమవుతాయి. దివ్యఖుర్‌ఆన్ దీన్నే చాటుతుంది.

**విశ్వసించిన వారలారా! అల్లాహ్‌కు భయపడండి, ఆయన సందేశహరుడు ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ను విశ్వసించండి, అల్లాహ్ తన కారుణ్యాన్ని రెండింతలుగా మిమ్మల్ని అనుగ్రహిస్తాడు. మీరు నడిచేందుకు వీలుగా కాంతినిచ్చే జ్యోతిని ప్రసాదిస్తాడు. మీ అపరాధాలను మన్నిస్తాడు; అల్లాహ్ ఎంతో క్షమించేవాడు, మరెంతో కరుణించేవాడు. *(57 : 28)***

ప్రపంచంలో అడుగడుగునా విభిన్న జీవన వ్యవహారాల్లో, అజ్ఞానపు వక్రమార్గాల మధ్య ఇస్లామ్ చూపే సరైన రుజుమార్గాన్ని తెలిపే వెలుగు నివ్వడంతో పాటు పరలోకంలో కూడా సాఫల్య మార్గాన నడిపించే జ్యోతిని ప్రసాదిస్తాడన్నమాట.

*(సెప్టెంబర్, 1991)*

# 38

**మనిషి అశక్తుడు.** జననం మొదలుకుని మరణం వరకు అన్నీ అతని అశక్తతకు తార్కాణాలు. తాను పుట్టకపూర్వం తానెవరో తనకే తెలియదు, ఎక్కడ పుట్టాలో, ఎప్పుడు పుట్టాలో, ఎవరింట పుట్టాలో - తన ఇష్టాయిష్టాల ప్రమేయం లేకుండానే ఇవన్నీ జరుగుతాయి.

అలాగే తాను కోరి పుట్టలేనట్లుగానే కోరి మరణించనూ లేడు. తనకు తెలియకుండానే, తన ప్రమేయం లేకుండానే తన మృత్యువూ సంభవిస్తుంది.

మనిషి మహా బలహీనుడు, తాను కోరినవన్నీ కోరినట్లే చేసుకుపోలేడు. ఈ విశ్వంలో కొన్ని ప్రకృతి నియమాలున్నాయి. కొన్ని ప్రతిబంధకాలున్నాయి. వాటిని దాటి పోలేడు. వాటి పరిధుల్లోనే ఏది చేసినా, చెయ్యదలచినా!

కాని మనిషి శక్తిమంతుడు కూడా!! బలోపేతుడు కూడా!!!

ప్రకృతి సిద్ధాంతాలకు, సృష్టి నియమాలకు లోబడుతూనే పట్టుదల ప్రదర్శిస్తే తాను సాధించలేనిదేదీ లేదు. ఈ విశ్వం అతని క్రియా క్షేత్రం, బల పరీక్షా రంగం, ఆలోచనలను అమలుపరిచే మైదానం.

అయితే తాను చెయ్యదలచుకున్నదేమిటి? తాను ఏ రూపు ధరించ తలపెట్టాడు?? తనను ఎలా మలచుకోవాలనుకున్నాడు??? అసలు ప్రశ్నలివి!

తాను ప్రకృతి నియమాలతో, సృష్టి సిద్ధాంతాలతో అభేద్యమయిన అనుసంధానం, సంపూర్ణ సహయోగం, సకలవిధ సామరస్యం సాధిస్తే అతని శక్తీ విజృంభిస్తుంది, బలమూ వికసిస్తుంది, మనసు, బుద్ధి, అన్నీ సహకరిస్తాయి.

ప్రకృతిలో ఈ అనుసంధానం, సహయోగం, సామరస్యాలే దైవ విశ్వాసంలో, దైవాదేశ పాలనలో తోటి మానవుల ఎడల సానుభూతి చూపడంలో పరలోక జీవిత భావనలో ఇమిడి ఉన్నాయి. మనిషికి స్థిర చిత్తం, సుస్థిర ఆలోచనలు, పటిష్ఠతర ఆచరణలు ప్రసాదించేవి ఇవే. లేకపోతే...

*"మనిషి సహనం లేనివాడుగా సృష్టించబడ్డాడు. కష్టాలు వాటిల్లగానే తల్లడిల్లిపోతాడు. సౌభాగ్యం వరిస్తే లోభిఅయిపోతాడు. అయితే వీరు* **(ఈ చెడుగుకు దూరంగా ఉంటారు) :** *సదా తమ నమాజులను క్రమం తప్పకుండా పాటించే నమాజ్ చేసే వారు, తమ సంపాదనలో ఉపేక్షితులకు, అర్థించేవారికి వారి వారి నిర్ణీత హక్కులు కేటాయించేవారు, పరలోక ప్రతిఫల దినాన్ని నమ్మే వారు, తమ ప్రభువు విధించే శిక్షకు భయపడే వారు– ఎందుకంటే ఆ ప్రభువు శిక్ష నిర్భయంగా మెలిగే విషయం కాదు."*

**(70 : 19 – 28)**

(అక్టోబర్, 1991)

# 39

**ఆరాధన – మానవుని** మనుగడకు లక్ష్యం ఆరాధన. మానవ మేధ పరిణతికి చిహ్నం ఆరాధన. బ్రతుకుకు వన్నె తెచ్చేది, మనిషికి పరిపూర్ణత నిచ్చేది, శ్వాసకు అర్థాన్నిచ్చేది, మనసుకు నెమ్మది తెచ్చేది ఆరాధన. ఆత్మకు నచ్చేది, ప్రభువు మెచ్చేది ఆరాధన.

ధర్మానికి మూలం ఆరాధన. దైవ మార్గదర్శక సూత్రం ఆరాధన. దైవ గ్రంథాల సారం ఆరాధన. దైవ సందేశహరుల బోధనా విషయం ఆరాధన. దైవ భక్తి పరాయణుల, సజ్జనుల, సత్పురుషుల జీవన ప్రతి రూపం ఆరాధన.

ఏమిటీ ఆరాధన? ఆరాధనకు నిర్వచనమేమిటి?? ఆరాధనకు భావమేమిటి???

ఆరాధన – ప్రేమకు ప్రతిబింబం, భక్తికి పరిణామం, శక్తికి సంకేతం, అనురక్తికి నిదర్శనం.

ఆరాధన అంటే పూజా పురస్కారాలే కాదు;

నమస్కారాలు, నమాజులే కాదు; ధ్యానం, చింతనలే కాదు. ఆరాధన అంటే బాధ్యత కూడా, విధేయత, ఆజ్ఞాపాలనకూడా; ఆరాధన అంటే ఆరాధనాలయంతో పాటు ఇంటి వీధి వ్యవహారాల్లో, బజారు లావాదేవీల్లో, ప్రభుత్వ కార్యక్రమాల్లో, సదస్సుల నిర్వహణలో, పాలనా భవనాల కార్యకలాపాల్లో కూడా పాటించవలసిన దైవిక నియమం. దైవ సందేశ హరుల్లో ప్రతి ఒక్కరూ తమ తమ కాలానికి, తమ తమ ప్రజలకు తగిన రీతిలో నేర్పిన ఈ ఆరాధనా విధానం వేర్వేరుగానే ఉన్నప్పటికీ వాటి మూలం, సారం మటుకు ఒకటే. ఏ కాలానికి, ఏ పద్ధతి నియమించినా,

నియామక శక్తి ఒక్కటే గనక అందులో వివాద పడవలసిన దేముంటుంది? అయితే విశ్వ ప్రభువు అంతిమంగా ఆదేశించిన విధానాన్ని తిరస్కరించి తగువులాడటం దైవ భక్తుల పని కాదు. అది పరిణామ ఫలం దృష్ట్యా ఎంతో ప్రమాదభరితమయింది.

**"ప్రతి మానవ సముదాయానికీ మేము ఒక ఆరాధనా విధానాన్ని నియమించాము. దాన్ని ఆ సముదాయం అనుసరిస్తూ ఉంటుంది. అందువల్ల ఓ ప్రవక్తా, వారు ఈ విషయంలో నీతో తగువులాడటం తగదు. నీవు మాత్రం (వారిని) నీ ప్రభువు మార్గానికి ఆహ్వానించు. నిస్సందేహంగా నీవు రుజుమార్గాన ఉన్నావు. వారు నీతో వాదులాడితే ఇలా చెప్పివెయ్యి, 'మీరు చేసేదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు. అల్లాహ్ ప్రళయదినాన ఈ వివాదగ్రస్త విషయాలన్నింటికీ మీ మధ్యన తీర్పు చేసివేస్తాడు.' ఆకాశాన, భూమిపైనా ఉన్న సకల విషయాలూ అల్లాహ్‌కు తెలిసినవే అన్న సంగతి నీవెరుగవా? ఇదంతా ఒక గ్రంథంలో పొందుపరచబడి ఉంది. అల్లాహ్‌కు ఇది ఏమాత్రం కష్టమయింది కాదు. *(22 : 67–70)***

(నవంబర్, *1991*)

# 40

ప్రపంచంలో ఎన్ని పిలుపులు! ఎటు విన్నా ఓ కొత్త పిలుపు!! ఎటు చూచినా ఓ కొత్త తలుపు!!!

'నేడు మనిషి విద్యా విహీనుడయి నాగరికతా ప్రవాహంతో సమంగా పరుగిడలేక పోతున్నాడు. అందువల్ల జనులారా, రండి విద్యా విజ్ఞానాలను పెంపొందించుకోండి. అక్షరాస్యతను పెంచండి. దేశ సౌభాగ్యానికి సరికొత్త ద్వారాలు తెరవండి' ఇదో పిలుపు.

మరో పిలుపేమో, 'ఆర్థికంగా ప్రగతి గడించనిదె ప్రపంచంలో స్థానం లేదు, అందుకు ముందు ఆర్థిక పురోగతికి మార్గాలు వెదకి ముందుకు సాగుదాం, రండి, రారండి!' అన్నది.

ఇంకొక పిలుపు ఇలా ఉంటుంది; 'నేడు ముఖ్యమయింది సాంకేతిక పరిజ్ఞానం; దానితో పాటు సాగే పారిశ్రామిక పురోభివృద్ధి; లభించే సౌలభ్యాలు, సౌకర్యాలు - ఇవే నేటి అవసరాలు. వీటి సాధనకై రండి పరుగులు తీద్దాం.'

వీటి నన్నింటినీ మించిన ఇంకొక పిలుపు - 'ప్రపంచ కార్మికులారా, ఏకం కండి, మీ చేతుల్లోనే ప్రపంచ భవితవ్యం దాగి ఉంది, రండి, దాన్ని ఆవిష్కరిద్దాం' అని మనిషిని ఆకట్టుకునేందుకు యత్నిస్తోంది.

అన్ని పిలుపుల వారూ తమ పిలుపు కనుగుణంగా తమ తలుపులు తెరచి ఆ మార్గమేదో చూపిస్తున్నారు కూడా.

మనిషి తికమక పడి, ఎటు పోవాలో ఏ పిలుపు విని ఏ తలుపులోంచి దూరాలో పాలుపోక ప్రతి ఒక్కరితో కొంత దూరం పోయి తిరిగి వస్తున్నాడు. అతనికి ఏ పిలుపూ మనుసుకెక్కడం లేదు.

కాని సృష్టికర్త, స్వామి, విశ్వ ప్రభువు మనిషి వినగల పిలుపుల్లో కెల్లా ఉత్తమమయిన పిలుపును తన దివ్యగ్రంథంలో ఇలా పేర్కొన్నాడు :

**దైవ ధర్మం వైపునకు పిలుపు నిచ్చేవాడు, సదాచార పరాయణుడు, 'నేను ముస్లిమ్‌ని' అని ప్రకటించేవాడు అయిన వ్యక్తి పలికే మాటకన్నా శ్రేష్ఠమయిన మాట ఎవరిది కాగలదు?" *(41 : 33)***

*(డిసెంబర్, 1991)*

# 41

**అరుణోదయ కాంతుల్లో** సూర్యుని అందం, పకపకలాడే పువ్వులు వెదజల్లే నిగనిగలు, ఘుమఘుమలు మనిషిని సదా ఉవ్విళ్లూరించాయి. మనిషి పులకించాడు, ఆనందించాడు.

కాని, అదే సూర్యుడు మధ్యాహ్నపు మండుటెండల్లో కణకణలాడితే మనిషి చిటపటలాడుతాడు. పువ్వులతావున ఉండే ముళ్ళు కలుక్కుమంటే మనిషి కసుక్కుమంటాడు. మంచిని చూసి సంబరపడటం, చెడును చూసి నుదురు ముడివడటం మనిషికి సహజం.

అందమయిన చందురునిలోని మచ్చ కూడా సొగసయినదేనని ఒప్పుకుంటాడేమో కాని, ఎదుటివాని నడతలో వంకలుంటే ఎన్నటికీ సహించడు. ఎదుటి వాని కంటి నలుసును కానగలిగినా తన కంటిలోని దూలాన్ని చూడలేడు. ఒకని వైపునకు ఓ వ్రేలు చూపిస్తే తన వైపునకు మూడు వ్రేళ్ళు చూపుతుంటాయని మరచిపోతాడు. అందుకే తప్పులెన్ను వాడు తన తప్పు లెరుగడని కవి ఒప్పుకున్నాడు.

సహజంగా శ్రేష్టతను, ఉత్కృష్టతను, పరిపూర్ణతను కాంక్షించే వాడు కనకనే సాధారణంగా మనిషి ఎదుటివానిలో ఆ గొప్పదనాలను చూడ కోరుకుంటాడు. తనలోనూ అవే ఉత్తమ లక్షణాలు కావాలని, తానూ ఉన్నత స్థాయికి ఎదగాలని, తానూపరిణతి చెందాలని సాధారణంగా అనుకోలేడు. సంస్కరణాభిలాషి అయిన ప్రతివాడు సంస్కర్త కాలేడు. సంస్కర్తకే తెలుసు సంస్కారం, సంస్కరణలు సదా తననుంచే మొదలవుతాయని.

మనిషి మాట మనిషి వినడు

క్రియామూర్తి వయిన నీవు

అదృశ్యవాణి వయ్యావంటే

ఆదర్శప్రాయమవుతావు

అలా అని ఇతరుల్ని చూడకూడదనీ, వారిలోని లోపాలను తీర్చిదిద్దరాదని ఎంత మాత్రం భావం కాదు. ఇతరుల తప్పుల్ని దూషణాభావంతో, తూలనాడే ఉద్దేశ్యంతో కాక సానుభూతితో, సంస్కరణా లక్ష్యంతో గమనించడం సబబే. ఎదుటి వారిని ఉత్తమోత్తమ స్థితిలో చూసే కోరిక, కృషి, ఎంతయినా అభినందనీయాలే. కాని తన్నుతాను మరచినవాడు మరెవరినీ బాగుచెయ్యలేడు. దివ్యఖుర్‌ఆన్ మనిషిలోని ఈ క్రియాశీలతను మేల్కొలిపే ఉద్దేశ్యంతోనే అంటుంది :

**"విశ్వాస జనులారా, మీ సొంత విషయాన్ని గురించి శ్రద్ధ వహించండి. ఇతరులెవరు మార్గవిహీనులయినా, మీరు స్వయంగా సన్మార్గాన ఉన్నట్లయితే మీకు కలగబొయ్యే నష్టమేదీ లేదు. మీరందరూ అల్లాహ్ వైపునకే మరలి పోవలసి ఉంది. అక్కడ ఆయన, మీరంతా చేస్తూ ఉన్నదేమిటో మీ అందరికీ తెలుపుతాడు !" (5 : 105)**

(జనవరి, 1992)

# 42

**నిరంతర సమర** క్షేత్రం ఈ జీవితం. మనిషి కళ్ళు తెరవగానే ప్రారంభమవుతుంది, మళ్ళీ కళ్ళు మూసుకునే వరకు సాగుతుంది.

మనిషి తన చర్మ చక్షువులతో బాటు అంతర్చక్షువుల్ని తెరువ గలిగే క్షణం మహత్తరమయింది. అది జీవన సంగ్రామానికి శంఖారావం. సంఘర్షణ సంరంభానికి ప్రారంభం.

ఈ సంఘర్షణ చతుర్ముఖమయింది. మనిషిని సకల దౌష్ట్యాల వైపునకు ఆకర్షించే పైశాచిక శక్తులు, ఊహా విహారాల్లోనే స్వర్గాన్ని చూపే వంచనాతత్వాలు, ఈ ప్రపంచమే సర్వమని, ఇదే తప్ప ఇతరం ఏదీ లేదని మభ్యపెడుతుంటాయి. ప్రపంచంలో ప్రాప్తించే సుఖ భోగాలను తనివి తీరా అనుభవించమని ప్రబోధిస్తుంటాయి. మనసారా ఆస్వాదించమని ఆహ్వానిస్తుంటాయి.

మరో వైపున, మనిషి ఆంతర్యంలోనే తిష్టవేసి అతన్ని పరిపరి విధాలా సంచరింపజేసే కాంక్షా వ్యామోహాలు తెల్లనివన్నీపాలని, తియ్యనిదంతా అమృతమని, సుఖమిచ్చేదంతా శుభప్రదమని, రుచి అయినవన్నీ శుచి అయినవేనని, సంబరాలకు హద్దులు అంబరాలేనని హితబోధలు చేస్తాయి. జీవితమంటే స్వేచ్ఛా విహారమని, జీవించడమంటే మజాలు జుర్రుకోవడమనీ నిర్వచిస్తాయి. మనిషిని మనసుకు బానిస చేస్తాయి.

ఇంకో వైపున భార్యా పిల్లలు, మిత్రులూ ఆత్మీయులు, చుట్టాలూ చుట్టూ ఉండేవారు, వంశంలోని పెద్దలూ సమాజంలోని పెద్ద మనుషులు, వీరందరూ అతనికి అలివి కాని పనులను పురమాయిస్తారు, మోయలేని భారాలు వేస్తారు, తట్టుకోలేని వెతలకు గురిచేస్తారు, చేయరాని పనులు చేయిస్తారు,

చేరరాని చోట చొరబడమంటారు. పెద్దల మాట ముత్యాల మూటలంటారు, శిరో భారమయినా శిరోధార్యమేనంటారు. అడుగడుగునా వెంటబడతారు చెడుగులన్నీ అంటగడతారు.

ఆ తరువాత జీవన వ్యవస్థలో – మనిషిని పరివేష్ఠించిన మత విశ్వాసాలు, నాగరికతా నియమాలు, రాజకీయ సిద్ధాంతాలు – మనిషిని వంగరాని చోట లొంగజేస్తాయి. సత్యానికి బదులు మిథ్యను ఆశ్రయింపజేస్తాయి. ధర్మానికి బదులు అధర్మాన్ని ఆచరింపజేస్తాయి. న్యాయానికి బదులు అన్యాయానికి ఒడిగట్టజేస్తాయి. సదాచారానికి బదులు అత్యాచారానికి పాల్పడజేస్తాయి. దైవ విధేయతకు బదులు దైవధిక్కారానికి పురికొలుపుతాయి.

వీటన్నింటికీ ఆయుధాలు వేరు గానీ లక్ష్యం ఒక్కటే – దేవుని దాసుణ్ణి తమ దాసునిగా చేసుకోవడం. దైవ విశ్వాసి వీటితో చతుర్ముఖంగా పోరాటం సాగించినప్పుడే నిజమయిన దైవ దాసుడుగా జీవించగలడు. ఈ పోరాటమే అతని విజయానికి సోపానం – ఇహంలోనూ, పరంలోనూ. ఈ విషయాన్ని దివ్యఖుర్‌ఆన్ విశ్వసజనులకు గుర్తుచేస్తుంది :

***"విశ్వసజనులారా, దైవానికి భయపడండి, ఆయన సాన్నిధ్యంలో స్థానం పొందే సాధనాలను వెదకండి, ఆయన మార్గంలో నిరంతర సమరం జరపండి – తద్వారా మీకు సాఫల్యం సంప్రాప్తం కావచ్చు." (5 : 35)***

(ఫిబ్రవరి, 1992)

# 43

**రమజాన్ నెల** దివ్యగ్రంథం అవతరించిన నెల, దైవం తన దివ్య వాణిని, అంతిమ గ్రంథం రూపంలో, అంతిమ సందేశహరునికి అవతరింప జేసేందుకు ఎన్నుకున్న నెల. ఈ నెలలోని ఓ మహా రాత్రిలో దైవ గ్రంథం అవతరణ ప్రారంభమయింది.

అందుకే ఈ నెలకు యింతటి ప్రత్యేకత. దైవం మానవాళికొరకు అందజేసిన తన మహోన్నత వర ప్రసాదానికి కృతజ్ఞతా సూచకంగా ఈ నెల సాంతం ఉపవాస వ్రతాన్ని పాటించమన్నాడు. ఆ వరప్రసాదమే మానవాళి అంతటికీ మార్గదర్శక గ్రంథం – దివ్యఖుర్ఆన్.

దివ్యఖుర్ఆన్‌లో ఉన్నదేమిటీ?

మానవులకు ధర్మమార్గం చూపే ఉత్తమోత్తమ వచనాలు, ప్రస్ఫుట మయిన ఆదేశాలు, స్పష్టమయిన నియమాలు, మనిషి వ్యక్తిగతంగానూ సామూహికంగానూ జీవితం గడపవలసిన విధానాలు.

దివ్యఖుర్ఆన్, కేవలం పారాయణం చెయ్యడానికి, రమజాన్ నెల రాగానే అటకమీది నుంచి తీసి, దుమ్ము దులిపి, రేయింబవళ్ళు శ్రావ్యంగా తన్మ యత్వంతో పఠించడానికి అవతరించిన గ్రంథం కాదు.

అది మన సృష్టికర్త, స్వామి, ప్రభువు మన కోసం ఎంతో ప్రేమతో అందజేసిన అమూల్యమయిన, అనుపమమయిన కానుక. జీవితమంతా రేయింబవళ్ళు పారాయణం చెయ్యడానికే కాదు, రేయింబవళ్ళు అడుగడుగునా జీవితంలో ఎదురయ్యే సర్వకాల సర్వావస్థల్లోనూ ఆచరించడానికి అరుదెంచిన అద్భుత గ్రంథం.

అందువల్లనే దాని అవతరణా సంరంభాన్ని, సందర్భాన్నీ విశ్వ ప్రభువు పట్ల మానవులు తమ అచంచల విశ్వాసాన్ని ప్రకటించడానికి, ఆయనపట్ల కృతజ్ఞతలు తెలుపుకోడానికి, ఆయన ఘనతను కొనియాడటానికి ఉపయోగించుకోమన్నాడు. ఆ సందర్భంలో రోజా ఉపవాస వ్రతాలు పాటించమని, ఉపవాసాల చివరన పండుగ జరుపుకోమని ఆదేశించాడు :

**రమజాన్ నెల, అందులోనే దివ్యఖుర్‌ఆన్ అవతరించింది. అది ఆసాంతం మానవాళికి మార్గదర్శకం. అందులో, రుజుమార్గం చూపే ప్రసుస్ఫుటమయిన బోధనలున్నాయి; సత్యాసత్యాలను విడమర్చి తెలిపే గీటురాయి ఉంది. మీలో ఆ నెలను కానగలిగిన వారు ఆ నెల అంతా ఉపవాస వ్రతాన్ని తప్పక పాటించాలి.... తద్వారా అల్లాహ్ మీకు సన్మార్గం చూపినందుకుగాను మీరు ఆయన ఘనతను కొనియాడాలి, ఆయనకు కృతజ్ఞతలు తెలుపుకోవాలి.**

***(2 : 185)***

(మార్చి, *1992*)

## 44

**అత్యంత వైవిధ్యంతో,** అత్యంత వైరుధ్యంతో అలరారే సొగసయిన ఈ నేల స్వేచ్ఛా కార్యక్షేత్రం. ఇక్కడ కంటికి కానరాని సూక్ష్మజీవులు మొదలుకుని క్రిమికీటకాలు, తేళ్ళు, జెర్రులు, జెర్రిపోతులు ఆంబోతులు, లేళ్ళూ, తోడేళ్ళు, గజరాజులు, వనరాజులు- ఒక్కటేమిటి- సకల సృష్టి ఇక్కడ తన ప్రకృతి ధర్మాన్ని నిర్వర్తిస్తుండగా ఒక్క మనిషికి మటుకే స్వేచ్ఛ సంప్రాప్తమయి ఉంది. తన ప్రవృత్తికి, తన సృష్టి వైశిష్టికి, తన సహజ ధ్యేయానికి వ్యతిరేకంగా ఆచరించే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మనిషికే ఉన్నాయి.

ఇక్కడ దొంగతనం చెయ్యగోరే మనిషికి, హత్యలు, దోపిడీలు చేసే వానికి, లూటీలు దహనకాండ జరిపేవానికి ఈ ప్రపంచ వ్యవస్థలో సకల అవకాశాలూ ఉన్నాయి. అలాగే ఒక విశ్వాసి, ధర్మపరాయణుడు, నీతిమంతుడు సత్యశీలుడు, సేవాతత్పరుడు, త్యాగధనుడు, నిష్ఠాసంపన్నుడు తనకు నచ్చిన రీతిలో మనుగడ సాగించదలిస్తే అతనికీ ఈ ప్రపంచ వ్యవస్థ తోడ్పడుతుంది.

అయితే సర్వ శక్తిమంతుడయిన విశ్వప్రభువు ఇదంతా ఎందుకు జరగనిస్తున్నాడు? ఆయన ప్రకృతికి అతీతమయిన తన శక్తితో కేవలం మంచినే వృద్ధిపరచి, చెడును నిర్మూలించేలా ఎందుకు చెయ్యడు??

ఏ మహోత్కృష్టమయిన మేలు అభివ్యక్తమయ్యేందుకు ఈ విశ్వ వ్యవస్థ అంతా సాగుతోందో అది ముందుకు రావాలంటే చీకటీ వెలుగులు, మేలూ కీడులు, నెమ్మదీ కల్లోలాల సంఘర్షణ ద్వారానే సాధ్యమవుతుంది.

విశ్వ ప్రభువు తన మహత్తర విజ్ఞతననుసరించి విధేయతా ధిక్కారాలకు, సత్యాసత్యాలకు, మానవతా రాక్షసత్వాలకు-అన్నింటికీ సావకాశంగా తమ

తమ పనులు చేసుకునే అవకాశాన్నిస్తాడు. మనిషి మేలునయినా కీడునయినా తనకు లభించిన స్వేచ్ఛ ద్వారా - దేన్నయినా గ్రహించి అవలంబించగలడు. దైవ నిర్ణయం ప్రకారం ప్రకృతి అతనికి రెండు విధాలుగానూ సహకరిస్తుంది. అయితే ఒకటి మాత్రం నిజం. స్వయాన విశ్వ ప్రభువు సహాయసహకారాలు కేవలం శుభకర కార్యాలకే ప్రాప్తమవుతాయి!

మేము ఎల్లప్పుడూ ఇదే విధంగా షైతానుల్లాంటి మానవుల్ని, జిన్నుల్నీ ప్రవక్తలకు విరోధులుగా చేశాము. వారు మోసపూర్వకంగా సంతోష జనకమయిన మాటలు పరస్పరం కూడబలుక్కుంటూ ఉంటారు. వారు ఇలా చెయ్య కూడదని నీ ప్రభువు నిర్ణయమయి ఉన్నట్లయితే వారిలా చేసి ఉండేవారు కాదు. కనుక నీవు వారి మానాన వారిని వదలివెయ్యి. వారిని ఇలాగే అబద్ధాలు సృష్టిస్తూ ఉండనివ్వు." *(6 : 112)*

(మే, 1992)

## 45

**వింతలు, విచిత్రాలు,** విపరీతాలు మనిషిని సదా ఆకర్షించాయి. నిజానికి వీటివైపు ఆకర్షితుడయినట్లు మనిషి, యదార్థాలవైపు, కళ్ళకు కనిపించే సత్యాలవైపు, అనుభవంలోకి వచ్చే వాస్తవాలవైపు ఆకర్షితుడవడు. ఇది మనిషిలోని దౌర్బల్యమనే చెప్పాలి.

మనలోని ఓ వ్యక్తి సత్యమే పలుకుతాడంటే, నిజాయితీగానే వ్యవహరిస్తాడంటే, మాటను నిలబెట్టుకుంటాడంటే, మనసులోని మాటను మొగమాటం లేకుండా చెప్పగలడంటే, చెప్పిన మాటను ఏది ఏమయినా చెయ్యగలడంటే ఎవరూ నమ్మరు - వింతగా చూస్తారు. వాస్తవానికి ఈ చర్యల్లో వింతయినదేదీ లేదు.

దీనికి భిన్నంగా పరిగెత్తే రైలు బండి నుండి దుమికి మనిషి చెక్కుచెదరకుండా ఉన్నాడంటే నమ్మేస్తారు. ఒకే కాన్పులో ఆరుగురు పిల్లలు పుట్టి సురక్షితంగా ఉన్నారంటే ఎంతమాత్రం త్రోసిపుచ్చరు. మనిషి అంతరిక్షంలో- శూన్యంలో నడిచాడంటే ఒప్పుకోవడానికి ఎంతమాత్రం వెనకాడరు. వాస్తవంలో ఈ చర్యలన్నీ ప్రకృతికి అతీత మయినవి, వింతయినవి.

పైన పేర్కొన్న రెండు విధాల చర్యలూ సత్యమయినవే అయినప్పటికి మొదటి కోవకు చెందినవి మనిషికి సహజమయినవి, సరళమయినవి. రెండవ కోవకు చెందినవి అసహజమయినవి, అసాధారణమయినవి, ఎంతో కష్టంతో కూడుకున్నవి. కాని మనిషి మొదటి కోవకు చెందిన వాటిని అంత సులువుగా నమ్మడు. రెండవ కోవకు చెందిన వాటిని సునాయాసంగా ఒప్పుకుంటాడు. ఇది మనిషిలోని బలహీనత కాకపోతే మరేమిటి?

మానవులకు ఆదర్శప్రాయుడు కాగలవాడు దైవ సందేశహరుడు. ఆయన దైవదూతో, మరే మానవాతీత శక్తో కావడం కన్నా మానవుల్లోని వ్యక్తే అవడం ఎంత సహజంగా, ఎంత సులువుగా ఉంటుంది?! కాని మనుషుల్లోని విచిత్రాన్వేషణ వారిని ఈ సహజ విషయాన్ని నమ్మనివ్వదు. దీన్ని వారు వింతగా, ఆశ్చర్యంగా, ఏదో అసహజమయింది జరిగినట్టుగా చూస్తారు. ఇది కూడా మానవుని దౌర్బల్యం అనడంలో సందేహమే లేదు. ఇది వారికి మాయలా, ఇంద్రజాలంలా అగుపిస్తుంది.

మనిషిలోని ఈ దౌర్బల్యాన్నే దివ్య ఖుర్ఆన్ ఇలా ఎత్తి చూపిందిః

*ఇదో విచిత్ర విషయమయిపోయిందా ఈ మనుషులకు – స్వయంగా వారిలోని ఒక వ్యక్తిపైనే మేము వహీ (దైవ సందేశం)ని అవతరింప జెయ్యడం, తద్వారా అతను (ప్రమత్తులయి ఉన్న) జనుల్ని హెచ్చరించడం, నమ్మిన వారికి వారి ప్రభువు వద్ద నిజమయిన గౌరవాదరణలు లభించనున్నాయని శుభవార్తనివ్వడం–! (ఇదంతా చోద్యమనిపించి) తిరస్కారులు 'ఈ వ్యక్తి నిస్సందేహంగా అతి స్పష్టంగా మాంత్రికుడే' అని అన్నారు. (10 : 2)*

(జూన్, 1992)

# 46

**తుమ్మ విత్తనం** నాటి నిమ్మ చెట్టు మొలకెత్తాలని కోరుకోవడం అత్యాశ, పేరాశే కావచ్చు. కాని మామిడి విత్తనం నాటి మామిడి చెట్టే మొలకెత్తాలని, మామిడి ఫలాలే పండాలని కోరుకోవడంలో అత్యాశ ఏమీలేదు, అసహజత ఎంత మాత్రం లేదు.

తాను చేసిన దాని ప్రతిఫలం తనకు దక్కాలన్నది మనిషి సహజమయిన, సమంజసమయిన ఆకాంక్ష. దీని కనుగుణంగానే ప్రపంచంలో మనిషి తన కార్యకలాపాలను కొనసాగిస్తున్నాడు. ఆ ఒక్క కోరిక కూడా లేకపోతే మనిషి బ్రతుకే అర్థరహితమయిపోతుంది.

మనిషి కృషి చేసిన ప్రతి రంగంలో ఫలం పొందుతున్నాడు. అయితే ఎవరి కార్యదృష్టి ఎన్ని దూరాల వరకు వెళ్ళగలుగుతుందో ప్రతిఫలమూ అంత దీర్ఘమయినదే ప్రాప్తిస్తున్నది. ఈ క్షణం కష్టపడితే మరుక్షణం ఫలం దక్కాలని కోరుకునే వారొకరయితే, యౌవనంలో పడిన శ్రమకు బదులుగా వృద్ధాప్యం హాయిగా గడవాలని ఆశించేవారు మరొకరు. ఇంకా కొందరయితే తాము కృషి సలిపిన దానికి తమ సంతానం సుఖపడినా చాలని కాంక్షించే వారుంటారు.

కాని ఇది జీవితాన్ని ఈ లోకం - కనిపించే ఈ భౌతిక లోకం - వరకు కానగలిగిన వారి పరిస్థితి. ఐహికలోక పరిధుల దాటి పరలోకపు పొలిమేరలను చూడగల వారి పరిస్థితి వేరుగా ఉంటుంది. ఆ దృష్టి లేకపోతే మనిషి ప్రాపంచిక సుఖభోగాలలోనే తేలియాడుతూ పరలోక సాధక బాధకాలను గురించి అట్టే ఆలోచించడు. ఆ పరిస్థితి ఎంతో భయంకరమయినది. ఎందుకంటే -

కేవలం ఈ ప్రాపంచిక జీవితం, దాని అందచందాలను కాంక్షించే వారికి వారి కార్యకలాపాల ప్రతిఫలాన్నంతటినీ మేము ఇక్కడే ఇచ్చివేస్తాము. ఇందులో వారికి ఎలాంటి కొరతా ఉండదు. కాని పరలోకంలో ఇలాంటి వారికి అగ్ని వినా మరేమీ దక్కదు. (అక్కడ వారికి బోధపడుతుంది:) వారు ప్రపంచంలో చేసినదంతా మట్టిలో కలిసిపోయిందని, వారు చేసినదంతా మిథ్యగా పరిణమించిందనీను!" *(11 : 15,16)*

*(జులై, 1992)*

# 47

**ఆధ్యాత్మికత, మతం,** ధర్మం- ఇవన్నీ మనిషి తనలోని ఆత్మ తృష్ణను తీర్చుకోవడానికి ఆది నుంచీ ప్రయోగిస్తున్న పదాలు.

ఈ ఆత్మ తృష్ణను తీర్చుకునేందుకే కొండల్లో, కోనల్లో, గుహల్లో, కారడవుల్లో ఘోర తపస్సులు ఆచరిస్తాడు మనిషి. దేశాటనలు చేస్తూ తృప్తిని వెదుక్కుంటూ తిరుగుతుంటాడు. ఆశ్రమాలు కట్టుకుని ఆత్మ పిపాస తీరుతుందని నిరీక్షిస్తూ కూర్చుంటాడు. యోగాలు చేసి సంతృప్తి చెందడానికి యత్నిస్తాడు. ప్రకృతి ధర్మాలకు విరుద్ధంగా ప్రవర్తిస్తూ భార్యా పిల్లల బాదరబందీ ఏదీ లేకుండా, 'సంసార జంజాటం'లో పడకుండా సర్వసంగ పరిత్యాగిగా, సన్యాసిగా కాలం వెళ్ళదీసి, ఆశలనన్నింటినీ జయించానని, ఆత్మ సంతృప్తి లభిస్తుందని 'ఆశిస్తాడు!' శతాబ్దాల తరబడిగా మనిషి చేస్తున్న ఈ చీకటిలో వెదుకులాట, అతనికి ఓ గమ్యాన్ని ఇవ్వలేక పోయింది, ఓ మార్గాన్ని చూపలేకపోయింది, ఓ దిశను నిర్దేశించ లేకపోయింది!!

నరాలను సయితం కొరికివేసే మంచుకొండల మధ్య ముక్కు మూసుకుని, ఆచరించే తపస్సును, ఆంతర్యాన్ని సయితం దహించివేసే కోర్కెల మధ్య జీవిస్తూ, వాటి నుండి తప్పించుకుంటూ ఆచరించవలసి వుంటుందని గ్రహించలేడు మనిషి. బాధ్యతా రహితంగా దేశాటనలు చెయ్యడంలో కాక బాధ్యతల్ని మోస్తూ స్థిరచిత్తంతో, నిలకడతో జీవితాన్ని ఎదుర్కోవడంలోనే తృప్తి దొరుకుతుందని గుర్తించలేడు. ఆశ్రమాలను కాదు గృహసీమను నిర్మించుకుని సంసార రసంతోనే ఆత్మ తృష్ణను తీర్చుకోగలగడం అర్థం కాదు మనిషికి. యోగాలు చేసుకుంటూ, సంసార యోగంలో వళ్ళు వంచి కృషించడంలో తృప్తి ప్రాప్తమవుతుందని తెలుసుకోలేడు. ఇల్లూ వాకిలిని కాదని, భార్యాపిల్లలకు దూరంగా బతకడం కాదు ప్రకృతి సంగీతంతో లయ

కలుపుతూ జీవన గానాన్ని ఆలపించడంలో, ఆశల పల్లకిలో పయనిస్తూ, ఆశయాల పల్లకిని మోస్తూ సర్వావస్థల్లో సంతృప్తిని సందర్శించగలగడమే మానవ పరమార్థమన్న ఇంగితం మేధో సంపన్నుడయిన మానవునికి బోధపడదు. కారణం, జీవనసారం సంసారంలో లేదనుకున్నాడు. జీవన సాగరంలో పయనం మానవ గమ్యం కాదనుకున్నాడు.

ఆధ్యాత్మిక వికాసం భౌతిక మండలంలో సాధ్యం కాదని తలపోశాడు. మతం అన్నది మనస్సుకు సంబంధించిందే కాని శరీరానికి వర్తించదని నిర్ణయించు కున్నాడు. దర్మం అంటే ప్రకృతి ధర్మానికి ఎదురీత అని భావించాడు.

అక్కడే తప్పటడుగు వేశాడు. శూన్యంలోకి జారి పాతాళానికి పడిపోతూ తాను మానవాతీత శక్తులతో గగన విహారం చేస్తున్నానని భ్రమపడ్డాడు. తన తప్పును గ్రహిస్తేనే మనిషి, భౌతికతా ప్రధానమయిన ఈ సంసార సాగరం గుండా సాగుతూ, ప్రకృతి ధర్మానికి అనుకూలంగా ప్రవర్తిస్తూ, ఆధ్యాత్మిక ఔన్నత్యాలను చేరుకోగలడని, ప్రపంచంలో పుట్టిన ఈ మనిషికి ఈ ధర్మపథం వినా మార్గాంతరం లేదని తెలుసుకోగలుగుతాడు.

**వైరాగ్యాన్ని వారు స్వయంగానే సృజించుకున్నారు. మేము దాన్ని విధించలేదు. దైవ ప్రసన్నత కోసం వారు స్వయంగానే ఈ అధర్మమయిన కొత్త పోకడను కల్పించుకున్నారు. ఆ తర్వాత దాన్నీ సరిగ్గా పాటించనూలేక పోయ్యారు. వారిలో విశ్వసించిన వారికి మేము వారి ప్రతిఫలాన్ని ప్రసాదించాము. కాని వారిలో అధికాంశం హద్దుల్ని అతిక్రమించిన వారే. *(57 :27)***

*(ఆగస్టు, 1992)*

# 48

భూమికి ఓ ఆకర్షణ శక్తి ఉందని, దాని కారణంగానే మనిషి నేలపైన నిలుచోగలుగుతున్నాడని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు, రుజువు చేస్తున్నారు. ఆ ఆకర్షణ సదా మనిషిని క్రిందికి లాగుతూ ఉంటుంది. అందువల్లనే మనిషి నేలపై నడవాలన్నా, నిలబడాలన్నా ఆ ఆకర్షణను అధిగమించి, తన్ను తాను అదుపులో ఉంచుకోవాలి; అదుపు తప్పితే పడిపోతాడు. ఆకర్షణ లాగుతుంది కాబట్టి పడిపోవడం సులువు.

అంతేకాదు పైకి ఎక్కాలంటే- చెట్టయినా, కొండయినా- కష్టమే. కొండ మరీ ఎత్తయి దారి దుర్గమమయినట్లయితే అడుగడుగునా తనపైన అదుపు సాధించడం మనిషికి మరీ అవసరం. కాస్త అదుపు తప్పినా ఎక్కినంత ఎత్తు నుంచి ధబేల్న క్రిందికి పడిపోతాడు. భూమిలోని ఆకర్షణ శక్తి అలాంటిది. ఆ ఆకర్షణకు లోనవకుండా జాగ్రత్త పడితేనే పైకెగబ్రాకగలడు మనిషి.

జీవితంలోనూ అంతే. జీవితంలో సదా రెండు బాటలు అడుగడుగునా ఎదురవుతుంటాయి. ఒకటి ఎత్తులకు, మనిషి ఊహించలేని ఎత్తులకు గొనిపోతుంది. కాని ఆ బాట కష్టసాధ్యమయింది. దుర్గమమయింది. ఎన్నో ఆటంకాలు, అడ్డంకులు, అవాంతరాలు, అభ్యంతరాలు ఎదురవుతాయి. అన్నింటినీ దాటుకుపోవాలి. వీటితోపాటు క్రిందికి దిగలాగే ఆకర్షణలు ఉండనే ఉన్నాయి. అన్నింటినీ అధిగమించాలి.

ఈ దారిలో మనిషిలోని మనస్సు సృష్టించే అభ్యంతరాలు, అవాంతరాలు; తన కుటుంబంలోని వారు, భార్యా పిల్లలు కల్పించే అడ్డంకులూ ఆటంకాలు; సమాజం పెట్టే ఆంక్షలూ ఆక్షేపణలు- అన్నీ ఓ వెంప మనిషి అడుగుతీసి అడుగు వెయ్యడం దుర్భరం చేస్తూ ఉంటే మరో వంక

మనసులోని కోర్కెలు, షైతాను చూపే అరచేతి స్వర్గాలు ప్రపంచంలోని సుఖాల ఆకర్షణలు క్రిందికి లాగుతుంటాయి. వీటన్నింటిపైన అదుపు సాధించాలి, వీటిని అధిగమించి నడవాలి, పోరాడాలి, పైకి ఎక్కాలి. అప్పుడే మానవతా శిఖరాలకు చేరగలడు మనిషి.

దీనికి భిన్నంగా, రెండవ దారి అతి సులువయినది. ఇది అథఃలోకాలకు గొనిపోతుంది. ఈ బాటలో ఎంత మాత్రం శ్రమించనవసరం లేదు. ఒక్క అడ్డులేదు. ఒక్క అభ్యంతరం లేదు. అసలు నడవనే అవసరం లేదు. కేవలం తన్నుతాను పరిస్థితులకు వదలివెయ్యాలి; మనస్సు పగ్గాలను కోర్కెల చేతుల్లో ఇచ్చివెయ్యాలి; అసలు పగ్గాలే లేకపోతే మరీ మంచిది; ఆకర్షణలకు దాసోహమనాలి; అంతే చాలు. మనిషి పల్లాలకు, లోతులకు, అథఃలోకాలకు దొర్లుకుంటూ అతి సునాయాసంగా చేరుకోగలుగుతాడు. దిగజారడం అంటే ఆకర్షణమీద అదుపు సాధించకుండా దాని అదుపులోకి తానేవెళ్ళడం అన్నమాట!

ధన సంపదల విషయంలో మనిషి ఎక్కవలసిన శిఖరాలను, జారిపోగల పాతాళాలను దివ్య గ్రంథం స్పష్టంచేసింది:

*మేము అతనికి రెండు కళ్ళూ, ఒక నాలుకా, రెండు పెదాలూ ఇవ్వలేదా? (మంచీ చెడుల) రెండు పస్పష్టమయిన మార్గాలు మేము చూపలేదా? కాని అతను దుర్గమమయిన ఎత్తు దారి గుండా నడవడానికి సాహసించలేక పొయ్యాడు. ఆ దుర్గమమయిన ఎత్తు దారి ఏమిటో మీకేం తెలుసు? అది– ఒకని మెడను బానిసత్వ బంధనాల నుండి విముక్తం చెయ్యడం, దగ్గరి అనాథకో లేక నేలపై పడుండే నిరుపేదకో ఆకలిగొన్న దినాన అన్నం పెట్టడం. ఇంకా మనిషి విశ్వసించిన వారిలో, ఓరిమినీ కనికరాన్నీ ఒకరికొకరు బోధించుకునే వారిలో చేరి ఉండటం." **(90 : 8–17)***

(సెప్టెంబర్, 1992)

# 49

**మార్గదర్శన శూన్యమయిన** జీవన పయనం-ఎడారి యానం. ఏ దారిన పోయినా దరి చేరని గమ్యం. ఎంత తిరిగినా తరగని దూరం. ఏ దిక్కు చూసినా దిక్కు తోచని శూన్యం. అడుగడుగునా పరుగిడజేసే ఎండమావులు. గుండె కోతలు; తీరని వెతలు, ఆరని సెగలు. జీవితం ఓ పాసగని పంతం.

కారడవిలోని క్రూర భయంకర మృగరాజుల వలె అనుక్షణం వేధించే కోర్కెల దాడులు జరుగుతూ ఉంటే, మనస్సుపైన, మస్తిష్కంపైన, ఆలోచనలపై, ఆచరణలపై అదుపులేని మనిషి చలించి వాటి ధాటికి తట్టుకోలేక నిర్నిబంధంగా కోర్కెలకు దాసోహమంటున్నాడు. ఈడేరని కోరికలతో సతమతమవుతూ ఊహల వాహనాలపైన ఆశల దీవులకు చేరి భ్రమల విహారం చేసే మనిషికి జీవితంలో కఠిన శిలలవంటి కఠోర సత్యాలు మీద పడి చితికివేసినప్పుడు కదలలేక, మెదలలేక నిశ్చేష్టుడయి నిర్వికారుడై నిలిచి పోతున్నాడు.

మరులు గొలిపే రుచులు మైమరిపింపజేస్తూ రారమ్మని పిలుచుకుపోయి ఆనంద విలాసాలపై తేల్చి, పొరలు కప్పిన ఊబిలోకి కంఠం వరకూ దింపినవేళ కాళ్ళూ చేతులూ ఆడక, కంఠశోష పెట్టినా ఆలకించే నాధుడు లేక కడతేరుతున్నాడు మనిషి.

కళ్ళు చెదిరే మిట్ట మధ్యాహ్నపు ఎండలకు మాడిపోవడానికే అలవాటుపడిన మనిషి, తెలవారు జామున, చలచల్లగా తొలిపొడుపు వేసే లేవెలుగు లాంటి సత్యాన్ని కానలేక, మిరుమిట్లు గొలిపే మిథ్యాలోకం వైపునకు వేగమే తప్ప చేతన లేని తీరులో దూసుకుపోతున్నాడు.

ఏది లాభమో ఏది నష్టమో, ఏది విజయమో ఏది అపజయమో, ఏది ప్రమాదమో ఏది ప్రమోదమో, ఏది అవసరమో ఏదనవసరమో, ఏది సత్యమో ఏదసత్యమో, ఏది ధర్మమో ఏదధర్మమో, ఏది వెలుగో ఏది చీకటో తెలియని మనిషికి తెలిపే సాధనం కావాలి. విచక్షణా జ్ఞానం కావాలి. ఆ సాధనం అందరికీ ప్రాప్తంకాదు. దానికి శ్రద్ధ కావాలి, భక్తి కావాలి, భీతి కావాలి, అనురక్తి కావాలి, అన్నింటినీ మించిన ప్రభు కటాక్షం కావాలి. ఆయన అదే అంటున్నాడుః

**"విశ్వసించిన జనులారా, మీరు దైవభక్తి, దైవభీతి విధానాన్ని అవలంబించి నట్లయితే అల్లాహ్ మీకు (మంచీ చెడుల విచక్షణ చూపే) గీటురాయిని అందజేస్తాడు. మీ చెడుగులను మీనుండి దూరం చేస్తాడు. మీ అపరాధాలను మన్నిస్తాడు. ఆయన మహత్తర అనుగ్రహ శీలి." ( 8 : 29)**

*(అక్టోబర్, 1992)*

# 50

**జాతి జీవనంలో** కొన్నేళ్ళు, కొన్ని దశాబ్దుల లెక్కేమిటి? విశ్వ ప్రభువు తన అనంత పరిపాలనా వ్యవస్థలో జాతులకు ఇచ్చే వ్యవధి కొన్ని శతాబ్దుల నుంచి కొన్ని సహస్రాబ్దుల వరకు విస్తరించడం మామూలే.

ఎన్ని జాతులు భువిలో తమ సమకాలీన జాతులపైన ఆధిక్యత సాధించి, నాగరిక, సాంకేతిక, సాంస్కృతిక, కళారంగాల్లో సాటిలేని ఉన్నతి గడించి, కొన్ని శతాబ్దుల వరకు తమ బలాధిక్యత, అధికారదర్పం, శక్తిసామర్థ్యాలను ప్రదర్శించి ఉన్న ఫళాన నేలమట్టమయిపోలేదు!

ఈ జీవితం- వ్యక్తిగతంగానూ సాముదాయికంగానూ, వ్యక్తులకూ జాతులకూ ఓ పరీక్ష- నిరంతర పరీక్ష. మనిషి పరీక్షించబడుతున్నాడు- ధనబలం, అంగబలం, బుద్ధి బలాల ద్వారా. మనిషి పరీక్షించబడుతున్నాడు- బీదరికం, అసహాయత, తెలివి లేమి ద్వారా. ఈ పరీక్షలో అతను తన నిజప్రభువుకు దాసుడయి మెలుగుతాడా లేక తిరుగుబాటు వైఖరినవలంబిస్తాడా అన్నదే చూడవలసింది.

అలాగే జాతులూ పరీక్షించబడుతున్నాయి, సముదాయాలూ పరీక్షించబడు తున్నాయి- సాధనా సామగ్రి ద్వారా, ప్రకృతి సిద్ధమయిన వనరుల ద్వారా, మానవ శక్తి వృద్ధి ద్వారా గౌరవ ప్రతిష్ఠల ద్వారా, అధికారం ద్వారా. సముదాయాలూ జాతులూ పరీక్షించబడుతున్నాయి- కరువుల ద్వారా, మానవశక్తి వినాశం ద్వారా, జాతుల మధ్య పరపతి లేమిద్వారా, పరాధీనత ద్వారా.

విభిన్న సముదాయాల సంచయనమయిన భారత దేశమూ పరీక్షించబడు తోంది. అందులోని సకల సముదాయాలూ పరీక్షించబడుతున్నాయి.

విశ్వ ప్రభువును విశ్వసించే వర్గాలూ, విశ్వప్రభువును తిరస్కరించే వర్గాలూ, ప్రభువు పంపిన మార్గదర్శకత్వాన్ని నమ్మే సముదాయాలు, మార్గదర్శకత్వంలేని సముదాయాలూ అన్నీ పరీక్షకు గురయ్యాయి. ఈ పరీక్షలో ఎవరు ఏ భూమిక నిర్వహిస్తున్నారో, ఎవరు ఏ బాటన నడుస్తున్నారో తేల్చడానికి తీవ్రమైన పరీక్ష జరుగుతోంది. ముస్లిములూ పరీక్షించబడుతున్నారుః

**ముస్లిములారా, మిమ్మల్ని ధన వినాశం ద్వారానూ ప్రాణ హాని ద్వారానూ నిశ్చయంగా పరీక్షించడం జరుగుతుంది. మీరు, గ్రంథవహులు, బహుదైవారాధకులు విసిరే అనేక బాధాకరమయిన మాటలు వినవలసి వస్తుంది. మీరు ఈ పరిస్థితుల వెంట సహనంతో దైవ భక్తితో సాగితే ఇది మహా సాహసోపేతమయిన విషయం. (3 : 186)**

(ఫిబ్రవరి, 1993)

## 51

**కనులెత్తి చూస్తే** కానవచ్చే కథలెన్ని, వినవచ్చే వ్యథలెన్ని? లోకంలో అడుగడుగునా పాఠాలు నేర్పే, గుణపాఠాలు గరిపే ఉదంతాలెన్నెన్ని?? కనులుండాలి, కానగలగాలి. వీనులుండాలి, వినగలగాలి. చూసినా, విన్నా అర్థం చేసుకునే హృదయముండాలి, అర్థం చేసుకోగలగాలి. అప్పుడే లోకంలోని నిదర్శనాలు సార్థకమవుతాయి, సాఫల్యానికి చేర్చుతాయి. వాటి ఉనికి మనిషి మనుగడకు అనువర్తిస్తుంది, మనిషి ఉనికికి అది అర్థాన్నిస్తుంది.

మెసపటోమియా నాగరికతల ఉన్నతి, ఈజిప్ట్ సాంకేతికతా ఉధృతి, సింధూ సాంస్కృతిక విస్తృతి- ఎన్నెన్ని సమాజాలు అవనిని అలంకరించాయి, మానవతను అలరించాయి, జీవితాన్ని డోలలూగించాయి. కాని అవన్నీ ఇప్పుడేవి? ఏమయ్యాయి?? ఎందుకు గుణపాఠాలుగా మాత్రమే మిగిలాయి???

ఓ సిద్ధాంతం, ఓ నియమం, ఓ కార్యక్రమం ఈ ధరిత్రి నిర్వహణలో అంతర్ తరంగమయి ప్రవహిస్తున్నట్లు, ఆ తరంగాలు మనిషికి తెలియకుండానే అతని వ్యక్తిగత సామూహిక జీవనాన్ని మలచుకుంటూ పోతున్నట్లు మనిషి ఎన్ని నాగరికతాకాశాలను అధిరోహించినా, ఎన్ని వైజ్ఞానిక అంతరిక్షాలను ఛేదించినా, ఎన్ని తాత్విక పాతాళాల్లోకి చొరబడి తేలినా ఆ తరంగాల తాకిడికి కొట్టుకుపోతున్నట్లు ప్రస్ఫుటంగా కానవస్తుందే- అంతర్ చక్షువుల్ని తెరచి చూడడా మనిషి?

మానవతా ప్రయాణం ఆ ప్రకృతి ధర్మానికనుగుణంగా, దానితో సామరస్యమొంది, దానితో శ్రుతి కలిపి, దానితో లయ జోడించి సాగినంత కాలం ఎన్ని ఔన్నత్యాలనయినా అధిగమిస్తుంది, ఎన్ని వైశాల్యాలయినా

విస్తరిస్తుంది, ఎన్ని లోతులనయినా తాకి వస్తుంది. ఆ సామరస్యం క్షీణించినప్పుడే, ఆ శ్రుతి తప్పినప్పుడే జీవన గమనం తడబడుతుంది, క్రింది కొరుగుతుంది, పతనమయిపోతుంది, శిథిలమయి పోతుంది.

సృష్టిని పరిపాలిస్తున్న ఆ ప్రకృతి ధర్మం ఏమిటి - ఈ సృష్టి స్వామికి, ఈ విశ్వ ప్రభువుకు ప్రకృతి యావత్తు తలొగ్గి సాగుతున్నట్లే మానవుడూ స్వయం సమర్పణ చేసుకు సాగడం. లేకపోతే అంతం తప్పదు. ఆ మాటనే ఆ విశ్వ ప్రభువు తన అంతిమ సందేశహరుని సంబోధిస్తూ అన్నాడు:

*"ప్రవక్తా, ఒకవేళ తిరస్కారులు నిన్ను నిరాకరిస్తూ ఉన్నారంటే (ఇది కొత్తదేమీ కాదు) వీరికి పూర్వం నూహ్‌జాతి, ఆద్, సమూద్ జాతులు, ఇబ్రాహీమ్ ప్రజలు, లూత్, మద్‌యన్ ప్రజలు నయితమూ ఇలాగే నిరాకరించారు. మూసాను కూడా నిరాకరించడం జరిగింది. ఈ సత్యాతిర స్కారులందరికీ నేను ముందు గడువునిచ్చాను, తరువాత పట్టుకున్నాను. ఇక నా పట్టు ఎలాంటిదో చూడు, ఎన్నెన్ని ధిక్కార నగరాలను మేము నాశనం చేశాము! అవి నేడు తమ కప్పులపైన బోర్లాపడి ఉన్నాయి. ఎన్నో నీళ్ళ బావులు నేడు పాడుపడిపోయాయి, ఎన్నో భవంతులు శిథిలమయి పోయాయి. వీరు (తిరస్కారులు) ధరణిలో తిరుగాడటం లేదా - వారి హృదయాలు వాటిని అర్థం చేసుకునేవి, వారి చెవులు వాటి గాథల్ని వినగలిగేవి! వాస్తవానికి కళ్ళు గుడ్డివికావు, గుడ్డివయ్యేవి వారి అంతర్యాల్లోని మనస్సులు!!" (22 : 42-46)*

(మార్చి, 1993)

# 52

**అందాలుజాలువారే ఈ విశ్వం,** ఆనందాలు విలసిల్లే ఈ లోకం, సుఖ భోగాలతో అలరారే ఈ జీవితం ఎవరికి ప్రియం కాదు?! దీనికి ఆవల మరో లోకం ఉందంటే, దీన్ని మించిన మరో స్వర్గం ఉందంటే వర్తమాన ప్రియుడయిన మనిషి నమ్ముతాడా, నమ్మి బ్రతకమంటే ఒప్పుకుంటాడా??

ఇహానికి బహుదూరంగా ఏదో పరముందని భయపెడితే సంతోషాలే తప్ప పరీక్షలూ, బాధలూ, ఆపదలూ ఆశించని, ఇష్టపడని ఈ ప్రాణి పరుగులు తీయడూ? విపత్తులూ, పరీక్షలూ ప్రమాదాలు జీవితంలో ఓ భాగమని అనుభవ పూర్వకంగా తెలుసుకుంటూ ఉన్నా అంత సునాయాసంగా అతని మనసు అంగీకరిస్తుందా? ఈ చేదు నిజాలు నా కళ్ళకు కనపడకున్నా, నా చెవికి వినపడకున్నా, నా బ్రతుకులోకి చొరబడకున్నా ఎంత బావుండేది అని పగటి కలలు కంటాడు.

అంతేకాదు, సరేపోనీ ఇవి వాస్తవాలే అనుకుందాము. ఈ లోకం తరువాత మరో లోకం రానున్నదే అని ఒప్పుకుందాము. అయితే అది తప్పక జరుగుతుందని నమ్మేందుకు ధృవపత్రాలు ఆ విశ్వ ప్రభువు నా వద్దకు పంపడేం? ఎవరో ప్రవక్తలుగా నియుక్తులయిన వారు చెప్పేదే మేము నమ్మాలా?? మా ప్రాముఖ్యం ఏమీ లేదా ఈ జగతిలో?! మాకు నేరుగా ఆ దేవుని సందేశాలందవేమిటి?

తనలో ఉత్పన్నమయ్యే ఈ కుశంకలకు, సందేహాలకు తనకు ఇష్టమయిన సమాధానాలు లభించక పోవడంతో అసలు ఇహమంతా వట్టి భ్రమ, మాయ అన్న నిర్ణయానికి వచ్చేస్తాడు. లేదా విశ్వమంటే కేవలం శక్తి

మటుకే, పదార్థం కూడా శక్తికి విభిన్న రూపమే అని నిర్ణయించుకుంటాడు. లేదా ఈ విశ్వం, దాని సర్వ కళా సంశోభిత స్వరూపం, దీని కార్యకలాపాలు, దీని ప్రాణికోటి, దీని సర్వశక్తుల్నీ తన అధీనంలోకి తెచ్చుకుంటున్న మానవుడు, దీనిపై తన మేధా శక్తితో ఆధిపత్యాన్ని చలాయించడానికి యత్నిస్తున్న మానవుడు – సర్వమూ యాదృచ్ఛికంగా ఏర్పడిందని భావిస్తాడు. అలా భ్రమలతో సంతృప్తి చెందుతాడు. ఫలితంగా దీని తరువాత మరో విశ్వ వ్యవస్థ ఏర్పడుతుందంటే ససేమిరా నమ్మడు.

మానవుడు రుజువర్తనాన్ని, సన్మార్గాన్ని అవలంబించకపోవడానికి అసలు కారణం దైవం పంపిన మార్గదర్శకత్వంలోని సత్యం, శుభం, సౌభాగ్యం అర్థంకాక కాదు, 'ఇహం' తరువాత 'పరం' ఉందన్న నిజాన్ని నమ్మలేక! దైవ గ్రంథం ఆ మాటనే చెబుతోంది :

**"ఇంతకూ వీరికి ఏమయింది, ఈ బోధనకు విముఖులవుతున్నారు? అడవిగాడిదలు పులి భయంతో పరిగెత్తినట్లే పరుగులు తీస్తున్నారు. ఇంకా నయం, వారిలో ప్రతి ఒక్కడూ తన పేరిట ప్రస్ఫుటమయిన పత్రాలు రావాలని అభిప్రాయపడుతున్నాడు. వీల్లేదు. వాస్తవమేమిటంటే వీరికి పరలోకం పట్ల భయమే లేదు.** ***(74 : 49–53)***

*(ఏప్రిల్, 1993)*

# 53

**దైవ గ్రంథం,** దైవ మార్గదర్శకత్వం, దైవ విధేయతా జీవనపథం- ఈ మాటలన్నింటి సారాంశమే ఇస్లామ్ !

దైవం సమక్షంలో ఆత్మ సమర్పణ చేసుకోవడం, దైవాదేశాలను శిరసా వహించడం, దైవాజ్ఞల్ని పాలించడం, దైవాధికారం ముందు తన స్వతంత్రతను, అధికారాన్ని వదులుకోవడం - ఇంతేకదా ఇస్లామ్ అంటే !! దేవుని సర్వాధికారం, ఆయన సర్వతోముఖ ప్రభుత్వం సమక్షంలో తలవంచడం తప్ప ఇస్లామ్ అంటే వేరే అర్థమేముంది?!

తల్లి ఒడిలో పసిపాప పెంపకమయినా, బడిలో పంతులు చెప్పే చదువులయినా, ఇంటిలోని ఇల్లాలి గొడవలయినా, నడి వీధిలో మనిషి నడవడి అయినా, బజారులో చేసే బేరసారాలయినా, బ్రతుకు తెరువుకోసం పడే పాట్లయినా, ఏలికలు సాగించే రాచపనులయినా - అన్నింటినీ ఆ దేవునికి అప్పగించినవాడే కదా ముస్లిమ్! పనులన్నీ తన మాట మీదుగానే జరుపుకునేవాడు, లేక దేవుణ్ణి కాదని వాటిని ఇతరులకప్పగించేవాడు, ఇతరులకు నచ్చిన తీరులో నడచుకునేవాడు ముస్లిమ్ ఎలా కాగలడు ?

దేవునికి అప్పగించడమంటే, ఆయన ఎదుట తలవంచడమంటే దైవం తన దివ్యగ్రంథంలోను, తన సందేశహరుని ద్వారాను తెలిపిన ఆయనకు ఇష్టమయిన ప్రబోధాన్ని స్వీకరించడం, ఆయన ప్రసన్నత మార్గాన్ని అనుసరించడం, ఈ మార్గానుసరణలో ఎలాంటి ఊగిసలాట లేకుండా, ఏకోన్ముఖుడయి ప్రవర్తించడం. ఒక్క మాటలో తన బాధ్యతలనన్నింటినీ తన స్వామికి అప్పజెప్పడం !

మక్కా మహానగరంలో కాబా గృహాన్ని - తొలి దైవ గృహాన్ని నిర్మించిన హజ్రత్ ఇబ్రాహీమ్ చేసింది ఇదే. ఆయన అనుసరించిన దైవ విధేయతా మార్గాన్ని, ఆయన చేసిన త్యాగాలను మననం చేసుకోవడం కూడా హజ్ ఉద్దేశ్యాల్లో ఒకటి. ఆయన గురించి దైవ గ్రంథం ఏమంటుంది?

***వాస్తవమేమిటంటే, తనంతట తానే ఒక నిండయిన సముదాయం, ఆయన అల్లాహ్ ఆజ్ఞాబద్ధుడు, ఏకాగ్రచిత్తుడు. (16 : 120)***

అవును, ఆయన తనలో తానే ఒక సంఘం, ఏకోన్ముఖుడయి దైవాజ్ఞాపాలన చెయ్యడంలోనూ ఆయనకు ఆయనే సాటి. అందుకే ఆయన చేసిన త్యాగాలకు గుర్తుగా కుర్బానీని నిత్యనియమంగా, హజ్‌లో అంతర్ భాగంగా చేశాడు పరమప్రభువు.

*(మే, 1993)*

# 54

**దైవప్రవక్తలు మానవులే.** ముహమ్మద్ (సఅసం) కూడా మానవుడే. అందరు మానవుల్లానే ఆయన పుట్టుక కూడా జరిగింది. శైశవం, బాల్యం, యౌవనం అన్ని దశలూ ఆయన జీవితంలోనూ తారసపడ్డాయి. భోజన పానీయాలు, కాలకృత్యాలు అన్నీ ఆయనకు మామూలుగానే ఉన్నాయి. ఆయనకూ పెళ్ళి జరిగింది. పిల్లలు పుట్టారు. వ్యాధులు వచ్చాయి, చికిత్స కూడా అవసరమయింది.

ముహమ్మద్ (సఅసం) ద్వారా ఓ ఉద్యమం, సాంఘికోద్యమం, నైతిక, ఆధ్యాత్మిక విప్లవోద్యమం ప్రారంభమయింది. అది విజయవంతంగా సఫలీకృతమయింది. ఓ నవ సమాజం వెలిసింది. ఓ వినూత్న రాజకీయ సామాజిక వ్యవస్థ నెలకొన్నది. ప్రపంచ చరిత్రలో ఓ నవశకం ప్రారంభ మయింది. అదే హిజ్రీ శకం.

హిజ్రత్ - వలస - అన్యాయమయిన, అమానుష వ్యవస్థ నుండి న్యాయ వంతమయిన మానవీయ వ్యవస్థ వైపునకు తరలివెళ్ళడం అన్నమాట.

హిజ్రత్ - చలన రహిత సమాజం నుండి క్రియాశీల, గతిశీల సమాజం వైపునకు.

హిజ్రత్- అజ్ఞానపు అంధకారాలనుండి విజ్ఞానపు కాంతి పుంజాల వైపునకు.

హిజ్రత్-మూఢ నమ్మకాల ఊబి నుండి సహేతుక సచేతన రాచబాట వైపునకు.

హిజ్రత్ - బహుదైవారాధన, విగ్రహారాధన, వ్యక్తి పూజల పద్మ వ్యూహం నుండి ఏకదైవోపాసన, నిరాకార ప్రభు ఉపాసన, దైవాజ్ఞాపాలనల సువిశాల మైదానం వైపునకు.

ముహమ్మద్(సఅసం) మానవుడే. ఈ ఉద్యమానికి ప్రప్రథమ రథసారథి అయిన దైవజ్ఞుడు. దైవ జ్ఞాన కాంతిలో ఉద్యమాన్ని నడిపి సఫలీకృతం చేసిన యోధుడు.

ముహమ్మద్ మానవుడే - దైవజ్ఞాన కాంతిలో సంచరించిన అంతిమ దైవ సందేశహరుడు - సల్లల్లాహు అలైహి వ సల్లం.

**ప్రవక్తా, ప్రకటించండి, నేను కూడా మానవుణ్ణే, మీ లాంటి వాణ్ణే. (వ్యత్యాసమల్లా ఒక్కటే) నాకు దైవవాణి అందజెయ్యబడుతుంది. మీ దైవం ఒకే దైవమని, కాగా తన ప్రభువును సందర్శించే ఆశగలవాడు సత్కార్మల నాచరించాలని, దైవోపాసనలో తన దైవానికి మరెవ్వరినీ సహవర్తులుగా ఎంచరాదనీను. *(18 : 110)***

*(జులై, 1993)*

# 55

**లోకోక్తులు ఊరికే పుట్టవు.** అవి మానవాళి గడించిన అనుభవాల సారం. అవి మానవాళి ఆలోచనా ఔన్నత్యానికి దర్పణం. అవి మానవాళి భావ ప్రకటనా నైపుణికి తొల్దొలి తార్కాణం. అందుకే అనుభవాలు విస్తృతమయిన కొద్దీ అవీ విస్తారమవుతుంటాయి. ఆలోచనల్లో లోతులు పెరిగిన కొద్దీ వాటిలో సూక్ష్మత అధికమవుతుంటుంది. భావాల సోపానాలు అధిరోహించిన కొద్దీ అవి ప్రస్ఫుటమవుతూ ఉంటాయి.

'యథారాజా తథా ప్రజా' అన్నది లోకోక్తి. రాచరిక వ్యవస్థకు అద్దం పట్టే నానుడి. బుద్ధిబలం, అంగబలం, ఆయుధ బలం ఉన్నవాడు జనుల మూర్ఖత్వాన్ని సొమ్ము చేసుకుని ఆడిన నాటకం ఫలితంగా ఉద్భవించిన చిక్కుముడి. దాన్ని నేడు తిరగవ్రాయాలన్న బలీయమయిన కోరిక మేథా సంపన్నుల్లో, బుద్ధి జీవుల్లో విరగకాస్తోంది. అనుభవాలు, ఆలోచనల ప్రభావం మరి!! 'యథాప్రజా తథారాజా!'

నేటి సంస్కృతీ సభ్యతలు, విద్యా విజ్ఞానాలు కొత్త రూపు ధరించే తహతహలో ఓనమాలు నేర్చుకుంటున్న రోజుల్లో, నేటికి 1400 ఏళ్ళ క్రితం ఓ నవ సమాజానికి అంకురార్పణ జరిగింది. పాలక వర్గ ప్రధానంగా కాక ప్రజా ప్రాతినిధ్య ప్రధాన వ్యవస్థకు మార్గం సుగమమవుతున్న ఆ శుభ ఘడియల్లో ఓ పథ నిర్దేశన ప్రస్ఫుటంగా ప్రత్యక్షమయింది. నవ్య వ్యవస్థా ప్రభాకరుని సముత్తేజ కాంతులకు నేల పులకించి నవజీవన హరితం చేతులు చాచి భూమినంతా ఆక్రమించుకోవాలని ఉవ్విళ్ళూరుతోంది. ఆ చారిత్రక విప్లవ తరుణంలో ఆ సన్మార్గ సూచన, రాచరిక జడ వ్యవస్థ నుంచి జన ప్రాతినిధ్య ప్రధానమయిన గతిశీల వ్యవస్థగా రూపాంతరీకరణకు మూలాంకురమయింది.

సమాజంలోని సామూహిక రంగాలన్నిటా ఆధిపత్యం, బాధ్యతాయుత స్థానం, ఆధ్యాత్మిక ప్రాధాన్యం, జాతీయ నాయకత్వం, విశ్వసనీయ హోదాలు ఎలాంటివయి ఉండాలి ? దీనికి ఆయా ప్రజల వివేచన, విచక్షణ, మనో వికాసం, బుద్ధి కుశలతలే ఆలంబన. జనుల మనో ప్రవృత్తి, జీవన పంథా, నైతిక ప్రమాణాలు దారి చూపుతాయి. అయోగ్యులు, అపాత్రులు, అల్ప మనస్కులు, అవిశ్వసనీయులు, అవినీతిపరులు, దుష్టులు, దుర్మార్గులు, నాయకత్వపు భూమిక నిర్వహించడం జన వ్యవస్థ పతనావస్థకు చేరువయిం దనడానికి నిదర్శనం. అన్యాయపరమయిన వ్యవస్థ నెలకొనడానికి రాచబాట.

అలా కాక బాధ్యతా భావాన్ని మోయగల శక్తి, స్తోమత, దక్షత, యోగ్యతలు, కార్య నిర్వహణకు కావలసిన సహనం, స్థయిర్యం, సామర్థ్యాలు, అందరితో కలిసి, అందరినీ కలుపుకుని ముందుకు సాగే నిస్వార్థత, కార్యశీలత, విశాల హృదయత, న్యాయపరాయణత, త్యాగనిరతి, ఉదార నీతి, రుజువర్తనం లాంటి గుణ గణాలున్న వారికి నాయకత్వపు బాధ్యతల్ని అప్పజెప్పినట్లయితే సమాజం ప్రగతీ వికాసాలతో పాటు సదాచార సచ్ఛీలతలతో, ప్రేమాభిమానా లతో అలరారుతుంది. న్యాయం నాలుగు పాదాల నడుస్తుంది. తన వారయినా పరాయి వారయినా, స్నేహమయినా శతృత్వమయినా, సర్వ కాల సర్వావస్థల్లో న్యాయమే పలికే, న్యాయమే జరిగే సమాజం నెలకొంటుంది. సమతుల్యం సర్వత్రా రాజ్యమేలుతుంది. అదే ఈ సద్వచనంలో భావం-

**ముస్లిములారా, అల్లాహ్ మిమ్మల్ని ఆదేశిస్తున్నాడు, అప్పగింతలు విశ్వసనీయులయిన వారికి అప్పగించండి. జనుల మధ్య తీర్పు చేసేటప్పుడు న్యాయంగా ప్రవర్తించండి. అల్లాహ్ ఉత్తమ హితోపదేశాన్ని మీకు అంద జేస్తున్నాడు. నిస్సందేహంగా అల్లాహ్ అన్నీ వినేవాడు, అన్నీ చూసేవాడు".**

***(4 : 58)***

(ఆగస్టు, 1993)